# పారాయణ గీత

(మూలశ్లోకములు, ఆంధ్రవచనరూపార్థము మాత్రముకలది)

అనువాదకుడు :

కందుకూరు - మల్లికార్జునం

''ఏకం సత్ విప్రా బహుధా వదన్తి''



శ్రీ రామకృష్ణ మఠము,

మైలాపూరు : : మద్రాసు - 4

# పీ ఠి క

మేము 1944-వ సంవత్సరమున తెనుగులో ప్రకటించి, ఇప్పుడు ఐదవ పునర్ముద్రణమొనర్చుచున్న "శ్రీమద్భగవద్గీత" సర్వవిధముల సమగ్రమై, జిజ్ఞాసువులకు సకలసంశయవిచ్ఛేదనసమర్థమై, గీతావిజ్ఞాన సర్వస్వమనదగి, పాఠకలోక సమాదరణ మందియున్నది. కాని నిత్యపారాయణైకపరాయణులగు భక్తజనులకు అంతపరిమాణము, అంత విషయ బాహుళ్యము, అంత ఖరీదు, గల గ్రంథము అనావశ్యకమనియు, శ్లోకములు, ధారాళమగు అనువాదము మాత్రము గల చిన్నపుస్తకము అనుకూలముగా నుండుననియు, అనేకులు తెలుపుచుండుటచేత వారి కోర్కె నాదరించి మే మీ గ్రంథమును ప్రకటించితిమి.

శ్రీ వివేకానందస్వాములవారి ప్రియతమశిష్యులలో నొకరగు శ్రీ స్వరూపానందస్వామియొక్క ఆంగ్లానువాదము ననుసరించి ఇందలి తెనుగర్థము వ్రాయబడినది. ఆ ఆంగ్లానువాదము శ్రీరామకృష్ణమఠపు అద్వైతాశ్రమమువారిచే 1909 లో ప్రకటింపబడి, పునర్ముద్రణములందుచు భారతదేశమందును, విదేశములందును అత్యంతవ్యాప్తిలోనున్నది.

శ్రీరామకృష్ణమఠము
మదరాసు-4
31-12-1957

ప్రకాశకులు

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సఙ్గవర్జితః ।
నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాణ్డవ ॥

అ. ౧౧, శ్లో. ౫౫.

---

నాకొఱకే కర్మము లాచరించుచు, నన్నే పరమగమ్యముగా ఉంచుకొని, నాకు భక్తుడై, సంగవర్జితుడై, ఎవరియెడలను వైరములేక యుండువాడు, నన్ను పొందును.

ఓమ్

# ధ్యాన శ్లోకములు

నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లారవిన్దాయత పత్రనేత్ర ।
యేన త్వయా భారత తైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥ ౧

ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥ ౨

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః ।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥ 3

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ ౪

---

౧. మహామతిమంతుడవును, వికసించినతామరరేకులవంటి విశాల నేత్రములు గలవాడవును, మహాభారతమను చమురు నిండారబోసి, జ్ఞాన దీపమును వెలిగించినవాడవును అగు వ్యాసదేవా, నీకు నమస్కారము.

౨. తన శరణుచొచ్చినవారిపాలిటి కల్పవృక్షమును (కోరుదానినెల్ల ఇచ్చువాడు) ఒకచేత పసులదోలు ములుకఱ్ఱను దాల్చినవాడును, జ్ఞాన ముద్రాధరుడును, గీతామృతమును పిదికినవాడును, అగు శ్రీకృష్ణునకు నమస్కారము.

3. ఉపనిషత్తులన్నియు ఆవులు, పసులకాపరికొడుకు పాలుపిదుకు వాడు, అర్జునుడు దూడ, వివేకబుద్ధిమహితులు త్రావువారు, పరమమగు గీతామృతము పాలు.

౪. వసుదేవునిపుత్త్రుడును, కంసచాణూరులను సంహరించినవాడును, దేవకీదేవికి పరమానందప్రదుడును, జగద్గురువును, దేవుడును అగు శ్రీకృష్ణునకు నమస్కారము.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౧ | 22 | చూచుచుండుము | చూచుచు, కర్మము లాచరించుచుండుము |
| ౩౫ | 21 | పాపిష | పాపిష్ఠ |
| ౩౮ | 20 | ప్రభుడను; | జీవులకు ప్రభుడను; |
| ౭౦ | 9 | అరునుడు | అర్జునుడు |
| ౮౫ | 14 | అధికారణ | ఆదికారణ |
| ౧౦౨ | 24 | వ్యవసితులగు | వ్యవస్థితులగు |
| ౧౧౧ | 11 | హితము | హితముకై |
| ౧౧౪ | 8 | భ.... | భక్తిప్రపూర్ణుడు |
| ౧౧౬ | 17 | మూలప్రకృ,తి | మూలప్రకృతి, |
| ౧౧౯ | 12 | యుడును | యుండును |
| ౧౨౫ | 16 | దారా | ద్వారా |
| ౧౨౭ | 25 | సుతులకు | స్తుతులకు |
| ౧౫౫ | 19 | పభుత్వము | ప్రభుత్వము |

ఈ క్రిందిచోట్లనుండు అవగ్రహములను (ఽ సంజ్ఞలను) కొట్టివేయవలెను:

పుట ౧౦ (పం. ౬), ౨౭ (౨*), ౨౮ (౭†); 33 (౪), ౪౨ (౭, ౯†), ౬౪ (౯†), ౬౭ (౫), ౭౯ (౪).

* మొదటిదానిని. † రెండవదానిని.

ఓం శ్రీరామకృష్ణపరబ్రహ్మణేనమః

# పారాయణ గీత



## ప్రథమాధ్యాయము



### అర్జునవిషాదయోగము

ధృతరాష్ట్ర ఉవాచ :—

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ ॥ ౧

సఞ్జయ ఉవాచ :—

దృష్ట్వా తు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా ।
ఆచార్యముపసఙ్గమ్య రాజా వచనమబ్రవీత్ ॥ ౨

పశ్యైతాం పాణ్డుపుత్రాణామాచార్య మహతీం చమూమ్ ।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ ౩

---

ధృతరాష్ట్రుడు పలికెను :—

౧. సంజయా, యుద్ధముచేయుటకై కురుక్షేత్రపుణ్యభూమిలో కూడి, మావారును పాండవులును ఏమిచేసిరి ?

సంజయుడు పలికెను :—

౨. అంతట వ్యూహబద్ధమగు పాండవసైన్యమును దుర్యోధనుడు చూచి, ద్రోణాచార్యునియొద్ద కేగి ఇట్లనెను :

౩. ఆచార్యా, ధీమంతుడగు నీ శిష్యుని — ద్రుపదపుత్త్రుని — చేత వ్యూహాకారముగా తీర్పబడిన ఈ పాండుపుత్త్రమహాసైన్యమును చూడుము.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ ౪

ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్ ।
పురుజిత్ కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః ॥ ౫

యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ ౬

అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ ౭

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః ॥ ౮

---

౪-౬. ఇందు శూరులును, మేటివిలుకాండ్రును, యుద్ధమున భీమార్జునులతో సమానులును అగువారు — సాత్యకి, విరాటుడు, ద్రుపదుడును; పరాక్రమశాలురగు ధృష్టకేతువు, చేకితానుడు, కాశీరాజును; మానవ శ్రేష్ఠులగు పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడును; మహాబలాఢ్యుడగు యుధామన్యుడును, ధైర్యశాలియగు ఉత్తమౌజుడును, సుభద్రాసుతుడును, ద్రౌపదీపుత్త్రులును — కలరు. వీ రందఱును మహారథులు.

౭. బ్రాహ్మణోత్తమా, మనలో ప్రఖ్యాతులై, మనసేనానాయకులుగా నుండువారిపేళ్లనుకూడ వినుము. నీ ఎఱుకకై ఆ పేర్లను చెప్పెదను.

౮. మీరు, భీష్ముడు, కర్ణుడు, యుద్ధవిజయశీలియగు కృపుడును; అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తసుతుడగు జయద్రథుడును;

అన్యే చ బహవః శూరాః మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥ ౯
అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥ ౧౦
అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః ।
భీష్మమేవాభిరక్షన్తు భవన్తః సర్వ ఏవ హి ॥ ౧౧
తస్య సంజనయన్హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥
తతః శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః ।
సహసైవాభ్యహన్యన్త స శబ్దస్తుములోఽభవత్ ॥ ౧౩

---

౯. ఇతరులగు శూరు లనేకులును — యుద్ధనిపుణులు — పెక్కు తెఱగు ఆయుధములు ధరించి, నాకొఱకు తమ ప్రాణము లర్పింప నంసిద్ధులై ఇచట నున్నారు.

౧౦. "భీష్మునిచే రక్షింపబడు మన యీ సైన్యము అపరిమితము; కాని భీమునిచే రక్షింపబడు వారిసైన్యము పరిమితము.

౧౧. "(ఇప్పుడు) మీ రందఱును సేనావ్యూహములలో మీ మీ స్థానములలో నిలిచి, భీష్మునే రక్షింతురుగాక".

౧౨. అపుడు ప్రతాపశాలియును, కురువృద్ధుడును, పితామహుడును అగు ఆ భీష్ముడు, దుర్యోధనునకు హర్షోత్సాహములుకలిగించుకొఱకు, బిగ్గరగా సింహనాదము చేసి, శంఖమును పూరించెను.

౧౩. అంతట (కౌరవపక్షమునుండి) శంఖములు, దుందుభులు, ఢక్కలు, తప్పెటలు, రణశృంగములు, హఠాత్తుగా ఒకేసారిగా మ్రోగెను. ఆ శబ్దము భయంకరముగా నుండెను.

తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ।
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః॥ ౧౪
పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః।
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః॥ ౧౫
అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః।
నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥ ౧౬
కాశ్యశ్చ పరమేష్వాసః శిఖణ్డీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః॥ ౧౭
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చ మహాబాహుః శఙ్ఖాన్దధ్ముః పృథక్ పృథక్॥
స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీఞ్చైవ తుములోఽభ్యనునాదయన్॥ ౧౯

---

౧౪. పిమ్మట తెల్లనిగుఱ్ఱములుపూన్చిన మహారథములో కూర్చుండియున్న కృష్ణార్జునులు తమ దివ్యశంఖములను అద్భుతముగా పూరించిరి.

౧౫. కృష్ణుడు పాంచజన్యమను శంఖమును, అర్జునుడు దేవదత్తమను శంఖమును పూరించిరి. భయంకరకార్యము లొనర్చు భీముడు పౌండ్రమను తన మహాశంఖమును పూరించెను.

౧౬. ధర్మరాజు అనంతవిజయమను శంఖమును, నకులసహదేవులు తమ సుఘోషమణిపుష్పకములను పూరించిరి.

౧౭. విలువిద్యలో మేటియగు కాశిరాజును, మహారథుడగు శిఖండియును, ధృష్టద్యుమ్నుడును, విరాటుడును, ఓటమినెఱుగని సాత్యకియు;

౧౮. రాజా, ద్రుపదుడు, ద్రౌపదీతనయులు, అభిమన్యుడు: వీరెల్లరును — అన్ని దిశలనుండి — తమ తమ శంఖములను పూరించిరి.

౧౯. ఆ భయంకరశబ్దము భూమ్యాకాశములనునిండి ప్రతిధ్వనించి ధృతరాష్ట్రపక్షమువారి గుండె లగల్చెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసమ్పాతే ధనురుద్యమ్య పాణ్డవః॥ ౨౦
హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే।

అర్జున ఉవాచ :—

సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥౨౧
యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్।
కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్రణసముద్యమే॥ ౨౨
యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః॥ ౨౩

సఞ్జయ ఉవాచ :—

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥౨౪

---

౨౦-౨౧ (౧) రాజా, అంతట ధృతరాష్ట్రపక్షమువారు యుద్ధసన్నద్ధులుగా తీర్పబడి నిలిచియుండుటను, ఆయుధప్రయోగము ప్రారంభము కాబోవుటను, అర్జునుడు చూచి, తన వింటిని ఎత్తి, కృష్ణునితో ఇట్లనెను:

అర్జునుడు పలికెను :—

౨౧ (౨)-౨౨. కృష్ణా, యుద్ధసన్నద్ధులై నిలిచియుండువారిని నేను చూచుకొఱకు నా రథమును ఉభయసేనలమధ్య నిలుపుము. నే నెవరెవరితో పోరుసల్పవలెనో, ఈ యుద్ధప్రారంభవేళయందు ఎఱుగనిమ్ము.

౨౩. దుర్మతియగు దుర్యోధనునిపక్షమున యుద్ధముచేసి అతనికి ప్రియమొనర్చుటకు ఈ యుద్ధభూమియందు ఎవరెవరిచట కూడియున్నారో వారిని చూడగోరెదను.

సంజయుడు పలికెను :—

౨౪-౨౫. భారతా, అర్జునునిచే ఇట్లు ఆజ్ఞాపింపబడి, శ్రీకృష్ణుడు ఇరుసేనలనడుమ, భీష్మద్రోణులయెదుట, భూపాలురందఱియెదుట, ఆ రథ

భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ పశ్యైతాన్సమవేతాన్ కురూనితి ॥ ౨౫

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః
పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్
పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా ॥ ౨౬

శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।
తాన్సమీక్ష్య స కౌన్తేయః సర్వాన్బన్ధూనవస్థితాన్ ॥
కృపయా పరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్ ।

అర్జున ఉవాచ:—

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్॥

---

శ్రేష్ఠమును నిలిపి, అర్జునా, "ఒకటిగాకూడియున్న ఈ కౌరవులనెల్ల చూడుము" అని పలికెను.

౨౬-౨౭ (౧) అచట నిలిచి, అర్జునుడు ఆ రెండుసేనలలోనున్న తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, అన్నదమ్ములను, దాయాదులను, కొడుకులను, మనుమలను, మిత్రులను, మామలను, శ్రేయోభిలాషులగు సహచరులను చూచెను.

౨౭ (౨)-౨౮ (౧). అచట నిలిచియున్న బంధువుల నందఱను చూచి ఆ అర్జునుడు మిక్కిలి ఖేదమునొంది, విషాదముతో ఇట్లనెను.

అర్జునుడు పలికెను :—

౨౮ (౨)-౩౦ (౧). కృష్ణా, యుద్ధాభిలాషతో ఇచట కూడియున్న నా స్వకీయులను చూడగా, నా అవయవములు తేలిపోవుచున్నవి; నోరు ఎండుచున్నది; శరీరమెల్ల కంపించుచున్నది; రోమములు గగుర్పొడుచుచున్నవి;

సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ ౨౯

గాణ్డీవం స్రంసతే హస్తాత్త్వక్ చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ ౩౦

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ।
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే॥

న కాఙ్క్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ।
కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగైర్జీవితేన వా॥ ౩౨

యేషామర్థే కాఙ్క్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ॥

ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః।
మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబన్ధినస్తథా॥

---

చేతినుండి గాండివము జాఱిపోవుచున్నది; చర్మము మండుచున్నది; నిలుచుండుటకుకూడ శక్యముకాకున్నది; మనస్సు తిరుగుచున్నది; అశుభసూచక శకునములు కాంచుచున్నాను.

౩౧(౨)-౩౨(౧). యుద్ధమున ఈ నా స్వజనమును చంపుటలోగల శ్రేయము నాకు కనిపింపకున్నది. విజయముగాని, రాజ్యముగాని, సుఖముగాని, నేను కోరుటలేదు.

౩౨(౨)-౩౪. ఎవరికొఱకు మనము రాజ్యమును, భోగములను, సుఖములను, కోరుచున్నామో ఆ వీరే — గురువులు, తండ్రులు, పుత్త్రులు, తాతలు, మామలు, మేనమామలు, మనుమలు, బావమఱదులు, చుట్టములు — ప్రాణములను, సంపదలను వదలి, ఇచట రణభూమిలో నిలిచియున్నప్పుడు, మనకు రాజ్యముగాని, భోగములుగాని, జీవితమైనగాని, ఏమి ప్రయోజనము?

ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతో౽పి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥ ౩౫

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిః స్యాజ్జనార్దన ।
పాపమేవాశ్రయేదస్మాన్హత్వైతానాతతాయినః ॥ ౩౬

తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ స్వబాన్ధవాన్ ।
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ ॥ ౩౭

యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ ౩౮

కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ॥ ౩౯

---

౩౫. వీరు నన్ను చంపినను, ముల్లోకముల అధిపత్యముకొఱకేనియు, వీరిని నేను చంపగోరను- ఇక భూలోకాధిపత్యముకొఱకా (చంపగోరుట)?

౩౬. ఈ ధృతరాష్ట్రసుతులను చంపుట మన కెట్లు ప్రీతికరము కాగలదు? చంపనుద్యుక్తులైయున్న వీరిని చంపినచో, మనకు పాపమే లభించును.

౩౭. కావున మన బాంధవులగు ధృతరాష్ట్రసుతులను మనము చంప దగదు. ఏలన, స్వజనమును చంపి మన మెట్లు సుఖము నొందగలము?

౩౮-౩౯. చిత్తములు పేరాసకు వశమైయుండుటచేత వీరు కులక్షయ మొనర్చుటవలని దోషమును, మిత్రద్రోహ మొనర్చుటవలని పాపమును, చూడజాలకున్నను, కులక్షయమువలని దోషమును స్పష్టముగ చూచు మనము ఆ పాపమునుండి ఏల తొలగరాదు?

కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాః సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత ॥ ౪౦

అధర్మాభిభవాత్ కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసఙ్కరః ॥ ౪౧

సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః ॥ ౪౨

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ ౪౩

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ ॥ ౪౪

---

౪౦. కులము (వంశము) క్షయించెనేని, ఆ కుల మనాదికాలమునుండి ఆచరించుచున్న కులధర్మములు నశించును. ధర్మములు నశించెనేని కుల మంతయు అధర్మముపా లగును.

౪౧. అధర్మము ఉదయించి వ్యాపించుటతోడనే, కులస్త్రీలు దుర్వర్తనమున చిక్కుదురు. స్త్రీలు దుష్టలు కాగానే, వర్ణసాంకర్యము కలుగును.

౪౨. వర్ణసాంకర్యము కులక్షయకారకులను, కులమును, నరకము పాలు సేయుట సిద్ధము. వారి పితరులుకూడ, పిండ, తర్పణోదకదాన విహీనులై నరకమున కూలుదురు.

౪౩. కులక్షయమును, తన్మూలమున వర్ణసాంకర్యమును, కలిగించువారి ఈ దోషములచేత అనాదిసిద్ధములగు జాతిధర్మములును, కులధర్మములును సమూలవినాశము నందును.

౪౪. కులధర్మములు నశించినట్టివారికి నరకనివాసము తప్పదని మనము వినుచున్నాము.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః॥ ౪౫
యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్॥ ౪౬

సఞ్జయ ఉవాచ:—

ఏవముక్త్వాఽర్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః॥ ౪౭

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగో నామ
ప్రథమోఽధ్యాయః

---

౪౫. అకటా, రాజ్యసుఖము లనుభవించు పేరాసచే, స్వజనమును చంప నుద్యుక్తులమై మన మీ మహాపాప మొనర్పబూనియున్నాము.

౪౬. ధృతరాష్ట్రపుత్రులు ఆయుధములుధరించి యుద్ధమున — నిరాయుధుడనై మాఱుపోరాడకయుండు — నన్ను చంపిరేని, అది నాకు ఎక్కువ శ్రేయస్కరముగా నుండును.

సంజయుడు పలికెను:—

౪౭. అర్జును డిట్లు యుద్ధభూమిమధ్యమున పలికి, వింటిని, అమ్ములను వీడి, దుఃఖముచేత సంక్షోభిల్లు మనస్సుతో, రథమున కూలబడెను.

శ్రీమద్భగవద్గీతోపనిషత్తులో, — బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదరూపమును అగుదానిలో—
"అర్జునవిషాదయోగము" అను పేరుగల
మొదటి అధ్యాయము సమాప్తము.



# ద్వితీయాధ్యాయము

## సాంఖ్యయోగము

సఞ్జయ ఉవాచ:—

తం తథా కృపయావిష్టమశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదన్తమిదం వాక్యమువాచ మధుసూదనః ॥ ౧

శ్రీభగవానువాచ:—

కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున ॥ ౨

క్లైబ్యం మాస్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప॥ 3

అర్జున ఉవాచ:—

కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ॥ ౪

---

సంజయుడు పలికెను :—

౧. జాలిచే ఇట్లు వివశుడై, దుఃఖించుచు, బాష్పపూరితములై, కలతనొందిన నేత్రములుకలిగియున్న అర్జునునితో కృష్ణు డిట్లు పలికెను.

శ్రీభగవానుడు పలికెను :—

౨. అర్జునా, ఆర్యులకు తగనట్టియు, అవమానకరమగునట్టియు, స్వర్గమార్గమున కడ్డుతగులునట్టియు, ఈ విషాదము ఇట్టిక్లిష్టసమయమున నిన్ను ఎచటినుండి ఆవరించినది ?

3. పందతనమునకు వశుడవు కాకుము. అది నీకు తగదు. నీచమగు ఈ మనోదుర్బలత్వమును త్రోసిపుచ్చి, లేచి నిలుచుండుము.

అర్జునుడు పలికెను :—

౪. కృష్ణా, పూజింపదగు భీష్మద్రోణులతో నేను బాణములు ప్రయోగించి యెట్లు యుద్ధముచేయుదును ?

గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే ।
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుఞ్జీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥ ౫

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః ।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ ౬

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః ।
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ ౭

---

౫. మహానుభావులగు ఈ గురుజనులను వధించుటకన్న ఈ లోకమున భిక్షాన్నముతినుచుండుటయే శ్రేయస్కరము. కాని వారిని వధించితినేని, నే ననుభవించు ధనసంపదలును, ఇష్టభోగములును, ఈ లోకమునగూడ, రక్తముతో తడిసియుండును.

౬. మనము వారిని జయించుటా, వారు మనలను జయించుటాః ఈ రెంటిలో మన కేది శ్రేయస్కరమో ఎఱుగజాలకున్నాను. ఎవరిని వధించినపిదప మనము జీవించియుండ నిచ్చగింపమో, ఆ ధృతరాష్ట్రపుత్రులే మనయెదుట నిలిచియున్నారు.

౭. దౌర్బల్యకారియగు పరితాపదోషమునకు నాస్వభావము వశమైనది. నామనస్సు ధర్మాధర్మవివేకమును కోల్పోయినది. కావున నిన్ను ప్రార్థించుచున్నాను. నా కేది శ్రేయస్కరమో నిశ్చయించిచెప్పుము. నీ శిష్యుడను. నీ శరణుచొచ్చితిని. కాన నాకు బోధింపుము.

న హి ప్రపశ్యామి మమాపనుద్యాద్
యచ్ఛోకముచ్ఛోషణమిన్ద్రియాణామ్ ।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ ౮

సఞ్జయ ఉవాచ:—

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః ।
న యోత్స్య ఇతి గోవిన్దముక్త్వా తూష్ణీం బభూవ హ॥ ౯
తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః ॥ ౧౦

శ్రీభగవానువాచ:—

అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః ॥ ౧౧

---

౮. స్పర్ధారహితము, సకలసంపత్సమేతము, అగు భూలోకరాజ్యమును, దేవతలమీదకూడ ఆధిపత్యమును పొందినను, నా యింద్రియములను శుష్కింపజేయుచున్న ఈ శోకమును పోగొట్టున దేదియు నాకు కానిపింపకున్నది.

సంజయుడు పలికెను :—

౯. కృష్ణునితో ఇట్లు చెప్పి, అర్జునుడు "నేను యుద్ధముచేయను" అని మౌనముదాల్చెను.

౧౦. ఓ భారతా, రెండుసేనలనడుమ ఇట్లు విషాదమునొందుచున్న అతనితో, శ్రీకృష్ణుడు నవ్వుచున్నవానివలె ఇట్లనెను:

శ్రీభగవానుడు పలికెను :—

౧౧. శోకింపదగనివారికొఱకు నీవు శోకించుచున్నావు. కాని జ్ఞానమయములుగాతోచు మాటలు పల్కుచున్నావు. యథార్థజ్ఞానులు మృతులైనవారికైగాని, సజీవులకైగాని, శోకింపరు.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ ॥ ౧౨

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాన్తరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి ॥ ౧౩

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత ॥ ౧౪

యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ ౧౫

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ ౧౬

---

౧౨. ఒకప్పుడు నేను లేకుంటినని కాదు, నీవును ఈ రాజులును లేకుండిరనియు కాదు. ఇకమీద మన మందఱము ఉండకపోవుదుమనియు కాదు.

౧౩. దేహధారియగు ఆత్మకు ఈ దేహమున బాల్యము, యౌవనము, వార్ధక్యము, ఎట్టివో, మఱొకదేహము దాల్చుటయు అట్టిదే. ఆత్మానుభూతిచే శాంతతనందినవారు అందుచేత మూఢత్వ మందరు.

౧౪. ఇంద్రియములతో ఇంద్రియవిషయములు కూడుటచేతనే శీతోష్ణములు, సుఖదుఃఖములు కలుగును. అవి ఆద్యంతములుకలవి, అశాశ్వతములు. వానిని ఓరిమితో సహింపుము.

౧౫. ఈ సుఖదుఃఖాదిద్వంద్వముల నెవడు సమభావముతో చూచునో, ఎవని నవి బాధింపవో, ఆ ప్రశాంతాత్ముడే మోక్షమున కర్హుడు.

౧౬. అసద్వస్తువునకు ఎప్పుడుగాని ఉనికి లేదు. సద్వస్తువునకు ఎప్పుడును ఉనికి లేకుండదు. సత్యజ్ఞానముగలవా రీ రెంటిని పూర్తిగా ఎఱుగుదురు. (సద్వస్తువు=మార్పులులేక కలకాల ముండునది).

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి॥ ౧౭

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥ ౧౮

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥౧౯

న జాయతే మ్రియతే వా కదాచి-
న్నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ ౨౦

---

౧౭. ఈ జగత్తు నంతయు వ్యాపించియుండుదానికి నాశములేదని ఎఱుగుము. మార్పులులేని ఈ పదార్థమును నాశమొనర్చుశక్తి ఎవరికిని లేదు.

౧౮. నిత్యమును, అవినాశియు, అపరిమితమును అగు ఆత్మ ధరించు ఈ శరీరములు అంతమొందునవి అందురు. కావున అర్జునా, యుద్ధము చేయుము.

౧౯. ఆత్మ చంపునట్టిదని తలచువాడు, చంపబడునట్టిదని తలచువాడుః ఈ ఉభయులు చక్కగా ఎఱిగినవారుకారు. అది చంపునదికాదు, చంపబడునదియుకాదు.

౨౦. ఈ ఆత్మ ఎన్నడును పుట్టదు, ఎన్నడును గిట్టదు. ఒకప్పుడు ఉండక, పిదప మరల కల్గునది అనియు కాదు. (లేక, ఒకప్పుడు ఉండి, పిదప ఉండకపోవునది అనియు కాదు). ఇది పుట్టువులేనిది, నిత్యము, మార్పులులేనిది, సర్వదా స్వస్వరూపముననే ఉండునది. శరీరము చంపబడినప్పుడిది చంపబడదు.

వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్॥ ౨౧

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ ౨౨

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥ ౨౩

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః॥ ౨౪

---

౨౧. ఇది నాశములేని దనియు, పెరుగుట లేనిదనియు, పుట్టుక లేనిదనియు, తఱుగుట లేనిదనియు ఎఱుగువాడు ఎట్లు చంపును, ఎట్లు చంపించును?

౨౨. మనుష్యుడు చినిగిపోయిన వస్త్రములను వీడి, ఇతర (క్రొత్త) వస్త్రముల నెట్లు ధరించునో, అట్లే దేహధారియగు ఆత్మ జీర్ణములై, నిరుపయోగములౌ దేహములనువీడి ఇతర (క్రొత్త) దేహములలో ప్రవేశించును.

౨౩. ఈ ఆత్మను శస్త్రములు నఱకజాలవు, అగ్ని కాలుపజాలదు, నీరు తడుపజాలదు, గాలి ఎండింపజాలదు.

౨౪. ఈ ఆత్మ నఱకను, కాలుపను, తడుపను, ఎండింపను అశక్యమైనది. ఇది నిత్యము, సర్వవ్యాపి, స్థిరము, చలింపరానిది, ఎల్లప్పుడొకే విధముగా నుండునది.

అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి॥ ౨౫

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాపి త్వం మహాబాహో నైనం శోచితుమర్హసి॥ ౨౬

జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి॥ ౨౭

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥ ౨౮

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన-
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్॥ ౨౯

---

౨౫. ఇది ఇంద్రియముల కగోచరమైనది, మనస్సునకు అందనిది, మార్పులు పొందనిది, అందురు. కావున ఇది యిట్టిదని గ్రహించి నీవు శోకింపదగదు.

౨౬. లేక దీని కెప్పుడును జననమరణము లుండునని నీవు తలచినను, అప్పుడుకూడ నీవు దీనికై శోకింపదగదు.

౨౭. పుట్టినదానికి చావు తప్పదు; చచ్చినదానికి పుట్టుక తప్పదు. తప్పింప నశక్యమగువిషయముకై నీవు శోకింపదగదు.

౨౮. భూతము లన్నియు పుట్టుకకుపూర్వము గోచరింపవు; పుట్టిన పిదప గోచరించును; లయించినపిదప మరల గోచరింపవు. కావున ఇందు దుఃఖింప నేమికారణము కలదు ? (భూతములు=చరాచరములు).

౨౯. ఈ ఆత్మను కొందఱు ఆశ్చర్యకరమైనదిగ చూతురు. కొందఱిది ఆశ్చర్యకరమైన దని చెప్పుదురు. మఱికొందఱు దీనిని ఆశ్చర్యకరమైన

దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత।
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి॥ ౩౦

స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే॥ ౩౧

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధమీదృశమ్॥ ౩౨

అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి।
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి॥ ౩౩

అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్।
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే॥ ౩౪

---

దానిగ విందురు. ఇంకను ఇతరులు వినిగూడ దీని నేమాత్రము గ్రహింప జాలరు.

౩౦. సర్వదేహములలో నివసించు ఈ దేహి ఎన్నటికిచంపనలవి కానిది. కావున అర్జునా, నీవు ఏ ప్రాణికొఱకుగాని శోకింపరాదు.

౩౧. స్వధర్మమును చూచినను నీవు చలింపదగదు. క్షత్రియునకు ధర్మయుద్ధముకన్న ఎక్కువశ్రేయస్కరమైన దేదియు లేదుగదా.

౩౨. అయాచితముగ లభించినదియు, తెఱచినస్వర్గద్వారమువంటి దియు, అగు ఇట్టి యుద్ధము తటస్థించిన క్షత్రియులు నిజముగా ధన్యులు.

౩౩. నీ వీ ధర్మయుద్ధము చేయవేని, స్వధర్మమును, కీర్తిని, పోగొట్టు కొని పాపము నొందుదువు.

౩౪. లోకులు నీ అపకీర్తిని కలకాలము ప్రస్తావించుచుందురు. గౌరవ మొందుచుండినవానికి అపకీర్తి మరణముకన్న కష్టతరమై తోచును గదా.

భయాద్రణాదుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥

అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యన్తి తవాహితాః ।
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ ౩౬

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ ౩౭

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥ ౩౮

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి ॥ ౩౯

---

౩౫. మహారథులగు యోధాగ్రేసరులు నీవు భీతిలి యుద్ధమునుండి తొలగితివని తలతురు. నిన్ను సన్మానించుచుండినవారు చులకనగా చూతురు.

౩౬. నీ విరోధులు నీ శక్తిని నిందించుచు అనరానిమాట లెన్నియో అందురు. అంతకన్న దుర్భరమైన దేమి యుండును ?

౩౭. సంహరింపబడితివేని స్వర్గము నొందుదువు. జయించితివేని భూమిని భోగింతువు. కావున యుద్ధముచేయ నిశ్చయించుకొని లెమ్ము.

౩౮. సుఖదుఃఖములను, లాభనష్టములను, జయాపజయములను సమముగాభావించి, పిదప యుద్ధముచేయ నుద్యుక్తుడవగుము. ఇట్లొనర్చితివేని పాపము నొందవు.

౩౯. నీ కిప్పుడు తెలుపబడినది ఆత్మానుభూతివిషయికజ్ఞానము. కర్మయోగవిషయికజ్ఞానము నిప్పుడు వినుము. ఈ జ్ఞానముతో నీవు కర్మబంధమునుండి విముక్తుడవవుదువు.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ ౪౦
వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥ ౪౧
యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతివాదినః॥ ౪౨
కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ ౪౩
భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే॥ ౪౪

---

౪౦. ఇందు ప్రారంభించి పూర్తిచేయబడని ప్రయత్నము విఫలము కాదు; విరుద్ధఫలముల నీయదు. ఈ ధర్మము స్వల్పముగా ఆచరింపబడినను సంసారచక్రమున చిక్కుకొను మహాభయమునుండి రక్షించును.

౪౧. ఇందు బుద్ధి ఏకనిష్ఠమైయుండును. చంచలచిత్తుల బుద్ధులు బహుశాఖలుగ చీలి, అనంతముఖములుకలవై, యుండును.

౪౨ - ౪౪. పెక్కుకోరికలుగలట్టియు; స్వర్గప్రాప్తినే పరమలక్ష్యముగా ఎంచునట్టియు; వేద (కర్మకాండ) మందలి ప్రశంసాసూచక వాక్యముల కానందించుచు, వే ఱ గు న ది (ఈశ్వరతత్త్వమనునది) ఏమియు లేదని వాదించునట్టియు; అప్రాజ్ఞుల మనోహరవాక్కులునమ్మి వివేకమును కోల్పోయినవారి మనస్సులందును, భోగైశ్వర్యములలో పూర్ణాసక్తులైనవారిమనస్సులందును, నిశ్చయాత్మకబుద్ధి యేర్పడదు. వారివాక్కులు భోగైశ్వర్యసాధకములగు అనేక క్రియావిశేషములతో నిండి, కామ్యకర్మఫలమగు పునర్జన్మమును కలిగించును.

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ ౪౫

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే।
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ ౪౬

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సఙ్గోఽస్త్వకర్మణి॥ ౪౭

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥ ౪౮

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనఞ్జయ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ ౪౯

---

౪౫. వేదములు త్రిగుణములనుగూర్చి చెప్పునవి. నీవు త్రిగుణములకును (ప్రకృతికి), ద్వంద్వములకును, అతీతుడవై, సర్వదా సమబుద్ధివై, యోగ (ఆర్జించుకొనుటందు), క్షేమ (కలదికాపాడుకొనుటందు) ప్రసక్తుడవు కాక, ఆత్మయందే సుప్రతిష్ఠుడవై యుండుము.

౪౬. సర్వత్ర వెల్లువనీరు నిండియున్నప్పుడు నూతివలన ఎంత ఉపయోగ ముండునో, ఆత్మజ్ఞానమును సాధించిన బ్రాహ్మణునకు వేదముల వలన అంత ఉపయోగమే ఉండును.

౪౭. కర్మ మొనర్చుటకు మాత్రమే నీ కధికారముకలదు. కర్మఫలముల కెన్నడునులేదు. ఫలముల నుత్పత్తిచేయు కర్మము లొనర్పకుందువు గాక; కర్మములు విడనాడుటందుకూడ ఆసక్తినొందకుందువుగాక.

౪౮. యోగమునందు సునిష్ఠితుడవై, సంగమువీడి, (కార్య) సిద్ధిని, అసిద్ధిని, సమబుద్ధితో చూచుచుండుము. సిద్ధ్యసిద్ధులందలిసమబుద్ధికే "యోగ"మని పేరు.

౪౯. ఫలాఫలవిచారమువలనకలతనొందని బుద్ధితో చేయబడు

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ ౫౦

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥ ౫౧

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥ ౫౨

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి॥ ౫౩

---

కర్మముకన్న కామ్యకర్మము ఎంతో అధమము. సమబుద్ధి నాశ్రయింప యత్నింపుము. ఫలములుగోరి కర్మము లాచరించువారు హీనులు.

౫౦. సమబుద్ధిని సాధించినవాడు ఈ లోకముననే పుణ్యపాపములు రెంటినుండి విముక్తుడగును. కావున ఈ బుద్ధియోగము (సమబుద్ధి) ననుష్ఠింపుము. కర్మమున కుశలత్వమే యోగము.

౫౧. బుద్ధియోగమును సాధించిన ప్రాజ్ఞులు కర్మఫలములను త్యజించి, జన్మబంధమునుండి విడివడి సర్వోపద్రవాతీతమగు స్థానమును పొందుదురు.

౫౨. నీ బుద్ధి అవివేక (అనాత్మను ఆత్మగాభావించు) కాలుష్యము నెప్పుడు దాటునో, అప్పుడు నీవు అప్పటికివిన్న, వినవలసియున్న, విషయములయెడ ఉపేక్షవహింతువు.

౫౩. అభిప్రాయభేదములచే ఇటునటు కొట్టుకొనుచున్న నీ బుద్ధి నిశ్చలమై, సమాధి (ఆత్మ) యందు సుప్రతిష్ఠితమైనప్పుడు, ఆత్మసాక్షాత్కృతి నందుదువు.

అర్జున ఉవాచ:—

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥ ౫౪

శ్రీభగవానువాచ:—

ప్రజహాతి యదా కామాన్సర్వాన్పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ ౫౫

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ ౫౬

యః సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౫౭

---

అర్జునుడు పలికెను :—

౫౪. సమాధిస్థితుడైన స్థితప్రజ్ఞుని లక్షణ మేమి? :సమాధిస్థితుడు కానప్పు డతడు ఎట్లు మాటలాడును, ఎట్లు కూర్చుండును, ఎట్లు నడచును?

శ్రీ భగవానుడు పలికెను :—

౫౫. మనస్సులోనికోర్కెల నెల్ల వీడి, ఆత్మయందే ఆత్మవలన సంతృప్తుడైయుండువానిని "స్థితప్రజ్ఞు" డందురు.

౫౬. దుఃఖములందు కలతనొందక, సుఖములందు వాంఛలేక, అనురాగభయకోపరహితుడై యుండువాడే స్థితప్రజ్ఞుడగు ముని (ధ్యాన నిష్ఠుడు).

౫౭. ఎవడు సర్వత్ర నిస్సంగుడై, శుభప్రాప్తికి అనందింపక, అశుభ ప్రాప్తికి ఖేదమొందక యుండునో, అతనిజ్ఞానము (ప్రజ్ఞ) స్థిరమైనది.

యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య_స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౫౮
విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ ౫౯
యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥ ౬౦
తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౧
ధ్యాయతో విషయాన్పుంసః సఙ్గస్తేషూపజాయతే ।
సఙ్గాత్ సఞ్జాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥

౫౮. తాబేలు తనఅంగములనెల్ల లోపలి కీడ్చుకొనునట్లే, మానవుడు తన యింద్రియములను విషయములనుండి పూర్తిగా ఈడ్చుకొనగలిగి నప్పుడు అతని జ్ఞానము సుస్థిరమైనది.

౫౯. ఇంద్రియవిషయములను భోగించుట మానుకొనినవానియొద్ద నుండి విషయములు మరలిపోవును. కాని వానిపైవాంఛ మిగిలియే యుండును. పరమాత్మదర్శన మొందినవానికి ఆ వాంఛయు నిలిచిపోవును.

౬౦. మానవుడు సిద్ధత్వముకై సదా యత్నించుచున్నను, అత డెంత ప్రాజ్ఞుడైనను, ఇంద్రియములు లొంగక ఆతనిమనసును బలాత్కరించి లాగుకొనిపోవును.

౬౧. సుస్థిరచిత్తుడు వాని నన్నిటిని వశపఱచుకొని, పరమాత్ముడనగు నాయందే బుద్ధి నిలిపియుండును. ఎవనికి ఇంద్రియములు స్వాధీనములై యుండునో వాని జ్ఞానమే సుస్థిరమైనది.

౬౨. విషయములనుగూర్చి చింతించుచుండువాని మనస్సు ఆ విషయములందు ఆసక్తమగును. ఆసక్తినుండి కోరిక, కోరికనుండి కోపము, ఉత్పత్తియగును.

క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥ ౬౩

రాగద్వేషవియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ ౬౪

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ ౬౫

నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।
న చాభావయతః శాన్తిరశాన్తస్య కుతః సుఖమ్ ॥ ౬౬

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి ॥ ౬౭

---

౬౩. కోపమునుండి మూఢత, మూఢతనుండి మతిమఱపు, మఱపునుండి యుక్తాయుక్తవివేకవినాశము, కలుగును. వివేకవినాశమొందినవాడు నైతికముగా మరణించినవా డగును.

౬౪. కాని సుస్థిరచిత్తుడు జితేంద్రియుడై, ప్రియాప్రియముల కతీతుడై, ఇంద్రియవిషయములనడుమ సంచరించుచునే ప్రశాంతినొందును.

౬౫. చిత్తప్రశాంతినొందినవాని దుఃఖము లన్నియు శమించును. వీలన ప్రశాంతచిత్తునిబుద్ధి త్వరితముగా (ఆత్మయందు) ప్రతిష్ఠితమగును.

౬౬. అస్థిరచిత్తులకు ఆత్మజ్ఞానము ఉండదు. ధ్యానముకూడ ఉండదు. ధ్యానహీనులకు శాంతియుండదు. అశాంతచిత్తులకు సుఖమెట్లుండును ?

౬౭. తిరుగుబోతులగు ఇంద్రియములవెంట పర్విడు మనస్సు అతని వివేకమును — నీటిపైనుండుపడవను త్రోవతప్పించి గాలి లాగుకొనిపోవునట్లు — తనవెంట లాగుకొనిపోవును.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇంద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ ౬౮

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥ ౬౯

ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ॥ ౭౦

విహాయ కామాన్యః సర్వాన్పుమాంశ్చరతి నిస్స్పృహః।
నిర్మమో నిరహఙ్కారః స శాన్తిమధిగచ్ఛతి॥ ౭౧

---

౬౮. కావున ఎవని ఇంద్రియములు తమ విషయములనుండి పూర్తిగా మరల్పబడియుండునో అతని జ్ఞానమే సుప్రతిష్ఠితము.

౬౯. జీవు లెల్లరకు ఏది రాత్రిగానుండునో (ఏకమగు దైవము కన్పింపక నానాత్వము కన్పించునో) దానియందు వశీకృతాత్ముడు మేల్కొని యుండును (ఏకత్వమునే చూచును). జీవు లెలరు ఎందు మేల్కొని యుందురో అది ఆత్మద్రష్టయగు "ముని"కి రాత్రి.

౭౦. సంపూర్ణముగా నిండి, మేరమీఱక, నిశ్చలమై యుండు సముద్రములోనికి జలపూరములు ప్రవేశించుచుండియు, అది ఎట్లు యథాపూర్వముగనే ఉండునో, అట్లే వివిధవాంఛలు ప్రవేశించుచుండియు అవి బుద్ధియందు లయించి నిరపాయములగుచుండు "ముని" శాంతినొందును. కోరికలు కోరుచుండువాడు శాంతినొందడు.

౭౧. వాంఛలెల్ల విసర్జించి ఆశాతీతుడై 'నేను', 'నాది' అను భావమే లేక జీవించుచుండువాడు శాంతినొందును.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥ ౭౨

ఇతి సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః

---

౭౨. ఇది బ్రహ్మమునందు నివసించియుండు స్థితి. దీనిని పొందినవా రెవ్వరును మూఢతలో పడరు. జీవితాంతముననైన ఈ స్థితియందు ప్రతిష్ఠితుడగువాడు బ్రహ్మముతోడి ఐక్యమునందును.

***"సాంఖ్యయోగము" అను పేరుగల
రెండవ అధ్యాయము సమాప్తము.



# తృతీయాధ్యాయము



## కర్మయోగము

అర్జున ఉవాచ:—

జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥ ౧

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్॥ ౨

శ్రీభగవానువాచ:—

లోకేఽస్మిన్ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥ 3

---

అర్జునుడు పలికెను :—

౧. కృష్ణా, కర్మముకంటె జ్ఞానము శ్రేష్ఠమని నీ యభిప్రాయమైనచో, నన్ని ఘోరకర్మమునందు ఏల ప్రవర్తింపజేయుచున్నావు ?

౨. పరస్పరవిరుద్ధములుగా తోచు ఈ మాటలవలన నా బుద్ధిని భ్రమింపజేయునట్లున్నావు; దేనివలన నాకు శ్రేయస్సు కలుగునో దాని నొక్కదానినే నిశ్చితముగా తెలుపుము.

శ్రీ భగవానుడు పలికెను :—

3. అర్జునా నేను సృష్ట్యాదియందు రెండువిధముల నిష్ఠల నీ లోకమునకు తెలిపితిని : ధ్యానశీలురకు జ్ఞానమార్గము, కార్యశీలురకు కర్మమార్గము.

న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥ ౪

న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ ౫

కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే॥ ౬

యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।
కర్మేన్ద్రియైః కర్మయోగమసక్తః స విశిష్యతే॥ ౭

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥ ౮

---

౪. కర్మము లొనర్పకున్నమాత్రాన మనుష్యుడు (నిష్క్రియము, వాంఛాతీతము అగు) ఆత్మస్వరూపావస్థితి నొందడు. కర్మసన్న్యాస (త్యాగ) మాత్రాన నైష్కర్మ్యసిద్ధి నొందడు.

౫. ఏ కర్మము చేయక మనుజుడు ఎన్నడును, క్షణమైన, ఉండ జాలడు. ప్రకృతిజనితగుణములచే బద్ధులై, సర్వజనులు — ఇష్టమున్నను లేకున్నను — కర్మము లొనర్చుచుందురు.

౬. కర్మేంద్రియములను నిగ్రహించి, ఇంద్రియవిషయములను మనస్సులో స్మరించుచుండు విమూఢుడు మిథ్యాచారుడు (కపటి) అనబడును.

౭. కాని మనస్సుచేత ఇంద్రియములను నిగ్రహించి, నిస్సంగుడై, కర్మేంద్రియములతో కర్మయోగమార్గము ననుసరించు మానవుడు శ్రేష్ఠుడు.

౮. నీవు శాస్త్రనిర్దిష్టములగు "నిత్యకర్మము" లొనర్చుచుండుము. ఏలన కర్మ మొనర్పకుండుటకన్న ఒనర్చుటే శ్రేష్ఠము. కర్మాచరణము నిలిపితివేని నీ శరీరపోషణకూడ జరుగదు.

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః।
తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గః సమాచర॥ ౯
సహాయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్॥ ౧౦
దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥ ౧౧
ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥ ౧౨
యజ్ఞశిష్టాశినః సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్॥ ౧౩

---

౯. యజ్ఞార్థమై ("యజ్ఞము" నకు ఈశ్వరుడనియు అర్థము) చేయు కర్మములుతప్ప తక్కినకర్మములు కర్మాధికారిని బంధించును. కావున నీవు నిస్సంగుడవై యజ్ఞార్థముమాత్రమే కర్మ మొనర్చుచుండుము.

౧౦. పూర్వము బ్రహ్మ యజ్ఞముతోకూడ ప్రజలను సృజించి వారి కిట్లు చెప్పెను: "దీనిచేత మీరు వృద్ధినొందుదురు. ఇది కామధేనువువలె మీ కోర్కులను తీర్చును.

౧౧. "దీనిచే దేవతలకు ప్రియమొనర్పుడు. ఆ దేవతలు మిమ్ము సంతుష్టులనొనర్తురు: ఇట్లు మీరు ఒండొరులకు ప్రియమొనర్చుకొనుచు, పరమశ్రేయమును పొందుదురు.

౧౨. "దేవతలు మీ యజ్ఞములచే సంతుష్టులై మీరుకోరుభోగముల నిత్తురు". దేవతల కేమియు అర్పింపక వారిచ్చుభోగముల ననుభవించు వాడు దొంగయే.

౧౩. యజ్ఞశేషమును భుజించు సజ్జనులు సర్వపాపవిముక్తు లగుదురు. తమకొఱకుమాత్రమే వంటచేసికొనువారు పాపమును భుజించు చున్నారు.

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ ౧౪
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ ౧౫
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయురిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥ ౧౬
యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే ॥ ౧౭
నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥ ౧౮

---

౧౪. ప్రాణు లన్నియు అన్నమునుండి ఉత్పత్తియగును; అన్నము వర్షమునుండి కలుగును; వర్షము యజ్ఞమునుండి పుట్టును. యజ్ఞము వేదవిహితహోమాదికకర్మమువలన జనించును.

౧౫. కర్మము వేదనిర్దిష్టమనియు, వేదము అవినాశియగు బ్రహ్మము నుండి పుట్టినదనియు, ఎఱుగుము. కావున సర్వవ్యాపియగు వేదము యజ్ఞమందు సదా సుస్థిరముగా నిలిచియుండును.

౧౬. ఈ లోకమున ఇట్లు ప్రవర్తింపబడిన (కర్మ) చక్రమును అనుసరింపక, పాపజీవియై, ఇంద్రియసుఖములందే సంతుష్టినొందుచుండువాని జీవితము వ్యర్థము.

౧౭. కాని ఆత్మయందే ప్రీతికలిగి, ఆత్మవలననే సంతృప్తినందుచు, ఆత్మయందే సంతుష్టివహించుచుండువానికి కర్తవ్యకార్యము లేవియు లేవు.

౧౮. అట్టివాడీ లోకమున కర్మాచరణముచే సాధింపవలసిన ప్రయోజన మేదియు లేదు; కర్మ మొనర్పకుండుటచే అతని కెట్టినష్టము లేదు; అతడు ఎందుకుగాని, ఎవనినిగాని, ఆశ్రయింపవలసిన ఆవశ్యకతకూడ లేదు.

తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ ౧౯
కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ ౨౦
యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ ౨౧
న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ ౨౨
యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ ౨౩

---

౧౯. కావున నీవు సర్వదా కర్తవ్యకర్మమును అనాసక్తుడవై యనుష్ఠించుచుండుము. అనాసక్తచిత్తముతో కర్మము నాచరించువాడు మోక్షమునందును.

౨౦. కేవలకర్మాచరణముచేతనే జనకాదులు సిద్ధత్వ మందిరి; మఱియు లోకజనులకు మార్గదర్శకముగానుండుటకొఱకును కర్మము నొనర్పవలెను.

౨౧. శ్రేష్ఠుడు ఏయేపనులు చేయునో, ఇతరులు అయాపనులనే చేయుదురు. అతడు కార్యరూపమున దేనిని ప్రామాణికమని నిర్ణయించునో దానినే లోక మనుసరించును.

౨౨. నే నీ ముల్లోకములలో చేయవలసినకార్య మేదియు లేదు; ఇప్పటికిసాధింపనిది, ఇకసాధింపవలసినది, ఏదియు లేదు. ఇట్లయ్యును నేను కర్మమందే ప్రవర్తించుచున్నాను.

౨౩. నేను అలసటచెందక ఎప్పుడును కర్మమునందు ప్రవర్తించుచుండకపోయినచో, మనుష్యులు సర్వవిధముల నా మార్గమునే అనుసరింతురు.

ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।
సఙ్కరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః ॥ ౨౪

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।
కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥ ౨౫

న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసఙ్గినామ్ ।
యోజయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్ ॥ ౨౬

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహఙ్కారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥ ౨౭

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే ॥ ౨౮

ప్రకృతేర్గుణసంమూఢాః సజ్జన్తే గుణకర్మసు ।
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥ ౨౯

---

౨౪. నేను కర్మ మొనర్పకుంటినేని, ఈ లోకములు నాశిల్లును. వర్ణసాంకర్యకారకుడనై ఈ ప్రజలకు చేటుకలిగించినవాడ నగుదును.

౨౫. కర్మమునందు సక్తతచే పామరు లెట్లు పనిచేయుదురో, అట్లే ప్రాజ్ఞులు అసక్తతతో, లోకకల్యాణవాంఛతో, పనిచేయవలెను.

౨౬. కర్మమునం దాసక్తులగు అజ్ఞానులబుద్ధిని ప్రాజ్ఞుడు చలింపజేయరాదు. అతడప్రమత్తుడై కర్మములాచరించుచు వారిని సర్వకర్మములందు నియోగింపవలెను (ఆచరించునట్లు చేయవలెను).

౨౭. ప్రకృతిలోని త్రిగుణములే సర్వకర్మముల నొనర్చునది. అహంకారముచే బుద్ధిమూఢతనొందుటవలన మానవుడు "నేనుకర్తను" అని భావించును.

౨౮. కాని గుణకర్మవిభాగమును నిజముగా ఎఱిగినవాఁడు — ఇంద్రియరూపములగుగుణములు విషయరూపములగుగుణములపై నిలిచియున్నవేగాని ఆత్మనిష్క్రియమని ఎఱిగినవాడు — అసక్తుడుకాడు.

మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ ౩౦

యే మే మతమిదం నిత్యమనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥ ౩౧

యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్విద్ధి నష్టానచేతసః ॥ ౩౨

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ ౩౩

ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ ౩౪

---

౨౯. ప్రకృతిగుణములచే మూఢతనొంది ఇంద్రియవ్యాపారములందు ఆసక్తులగు అల్పజ్ఞులబుద్ధిని పూర్ణజ్ఞానమునొందినవారు చలింపజేయరాదు.

౩౦. సర్వకర్మములను నాకు సమర్పించి, బుద్ధిని ఆత్మయందు నిలిపి, కోరికలు, మమకారములు వీడి, చింతాజ్వర (శోక) రహితుడవై యుద్ధముచేయుము.

౩౧. ఈ నా మతమును (బోధను) దురాక్షేపములొనర్పక, శ్రద్ధాపూరితులై, సర్వదా అనుష్ఠించువారుకూడ కర్మాచరణమునుండి విముక్తులగుదురు.

౩౨. కాని ఈ నా బోధను నిందించుచు, దాని ననుష్ఠింపకుండు అవివేకులును, కేవల జ్ఞానశూన్యులును, (పరమార్థ) భ్రష్టులని ఎఱుగుము.

౩౩. జ్ఞానియగువాడుకూడ తన ప్రకృతి ననుసరించియే ప్రవర్తించును. సర్వభూతములు (సృష్టిలోని సర్వచరాచరములు) తమతమ ప్రకృతినే అనుసరించును. నిగ్రహము ఏమిచేయగలదు?

౩౪. ఇంద్రియములకు తమతమవిషయములయెడ గల అనురాగద్వేషములు ప్రకృతిసిద్ధములు. కాని ఎవడును ఆ రెంటికి వశుడు కాకుండుగాక. అవి అతని శ్రేయోమార్గమునకు అడ్డువచ్చు శత్రువులు.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ 35

అర్జున ఉవాచ:—

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥ 36

శ్రీభగవానువాచ:—

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥ 37
ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్॥ 38
ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ॥ 39

---

35. చక్కగా అనుష్ఠింపబడిన పరధర్మముకంటె సదోషముగా అనుష్ఠింపబడిన స్వధర్మమే శ్రేష్ఠము. స్వధర్మము ననుష్ఠించుచు మరణించుటయు శ్రేయస్కరమే. పరధర్మానుష్ఠానము భయకారణము.

అర్జునుడు పలికెను :—

36. కృష్ణా, తనకు ఇష్టములేకున్నను, మానవుడు దేని ప్రేరణముచే — బలాత్కరింపబడినట్లు — పాప మొనర్చుచున్నాడు ?

శ్రీ భగవానుడు పలికెను :—

37. అది రజోగుణమునుండి ఉత్పత్తియగునదియు, తనుపశక్యము కానిదియు, మహాపాపిష్ఠమైనదియు, అగు కామము. కోపముకూడ దీని మాఱురూపమే. ఈ లోకమున ఇది శత్రువని ఎఱుగుము.

38. అగ్ని పొగచేత, అద్దము మురికిచేత, గర్భములోనిపిండము మావిచేత, కప్పబడియుండునట్లు ఇది (జ్ఞానము) దానిచే (కామముచే) కప్పవడి యుండును.

ఇన్ద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥ ౪౦

తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ ౪౧

ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥ ౪౨

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥ ౪౩

ఇతి కర్మయోగో నామ
తృతీయోఽధ్యాయః

---

౩౯. జ్ఞానులకు నిత్యవైరియగు — తనుప (తృప్తిపఱుప) శక్యముకాని — ఈ కామాగ్నిచే జ్ఞానము మఱుగువడుచున్నది.

౪౦. దీని ఉనికిపట్టు మనస్సు, బుద్ధి, ఇంద్రియములు అని చెప్పుదురు. వీనిద్వారా జ్ఞానమును కప్పివైచి అది దేహధారియగు ఆత్మను మూఢత నొందించును.

౪౧. కావున మొదట ఇంద్రియముల నరికట్టి జ్ఞాన (శాస్త్రలబ్ధము) విజ్ఞాన (అందుపైఅనుభవలబ్ధము) నాశకారియగు ఈ పాపరూపిని — కామమును — తుదిముట్టింపుము.

౪౨. ఇంద్రియములు (శరీరముకంటె) శ్రేష్ఠము; మనస్సు ఇంద్రియములకంటె శ్రేష్ఠము; బుద్ధి మనస్సుకంటె శ్రేష్ఠము; అతడు (ఆత్ముడు) బుద్ధికంటె శ్రేష్ఠుడందురు.

౪౩. ఇట్లు అతని — బుద్ధికంటెశ్రేష్ఠుడగువాని — నెఱిగి, ఆత్మను (జడ ప్రకృతిని) ఆత్మ (ఉత్తమ ప్రకృతి) చేత అరికట్టి, పట్టుకొనశక్యముకాని ఆ శత్రువును — కామమును — రూపుమాపుము.

*** "కర్మయోగము" అను పేరుగల
మూడవ అధ్యాయము సమాప్తము.

# చతుర్థాధ్యాయము



## జ్ఞానకర్మసంన్యాస యోగము

శ్రీభగవానువాచ:—

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।
వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ ౧

ఏవం పరమ్పరాప్రాప్తమిమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప ॥ ౨

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్॥ ౩

---

శ్రీ భగవానుడు పలికెను :—

౧. తఱుగనిఫలము నిచ్చు ఈ యోగమును నేను సూర్యునికి బోధించితిని. అతడు (తనపుత్త్రుడగు) మనువునకు దానిని బోధించెను. అతడు (తనపుత్త్రుడగు) ఇక్ష్వాకునకది బోధించెను.

౨. ఇట్లు వంశపరంపరగావచ్చి ఈ యోగము రాజర్షులకు తెలిసియుండెను. కాని దీర్ఘకాలము గడచుటచేత ఇది లోకమున నమసిపోయెను.

౩. ఈ పురాతనయోగమును నేడు నీకు — నీవు నా మిత్త్రుడవును, భక్తుడవును, గనుక — నేను తెలిపితిని. ఇది అత్యుత్తమమగు రహస్యము.

అర్జున ఉవాచ:—

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ ४

శ్రీభగవానువాచ :—

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప ॥ ౫

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మమాయయా ॥ ౬

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ ౭

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ ౮

---

అర్జునుడు పలికెను:—

४. సూర్యుడు ముందుపుట్టెను, నీవు పిమ్మట పుట్టితివి; నీవు దీని నతనికి ఆదికాలముననే తెలిపితి వన్నమాటను నే నెట్లు గ్రహింపవలెను?

శ్రీ భగవానుడు పలికెను :—

౫. అర్జునా, నాకును నీకును పెక్కు జన్మములు గడచినవి. నేను వాని నన్నిటిని ఎఱుగుదును, నీ వెఱుగవు.

౬. నేను పుట్టుకలేనివాడను, మార్పులెఱుగని నిత్యస్వభావము గలవాడను, ప్రభుడను; ఐనను నా ప్రకృతిని లోబఱచుకొని (సామాన్యులు ప్రకృతి కధీనులు) నా మాయవలన పుట్టుచుందును.

౭. ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి, అధర్మము వృద్ధినొందునో అప్పుడెల్ల నేను దేహముదాల్చి జన్మింతును.

౮. సాధురక్షణార్థము, దుష్టవినాశనార్థము, ధర్మసంస్థాపనార్థము, నేను ప్రతియుగమున ఉద్భవించుచుందును.

జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥ ౯

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ ౧౦

యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ ౧౧

కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ ౧౨

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ ౧౩

న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ ౧౪

---

౯. ఇట్లు అలౌకికమగు నా జన్మమును, కర్మమును, యథార్థవిధమున నెఱుగువాడు, శరీరపతనానంతరము పునర్జన్మ మందక నన్ను పొందును.

౧౦. అనురాగ, భయ, కోప విహీనులై, నన్నే భావించుచు, నన్నే ఆశ్రయించి, జ్ఞానాగ్నిచేత పవిత్రతనొంది, అనేకులు నాతో ఐక్యమందిరి.

౧౧. ఎవరు ఏ మార్గమున నన్ను ఉపాసింతురో, వారి కా మార్గముననే నేను ఇష్టార్థసిద్ధి యొనర్తును. అన్నిమార్గముల ననుసరించువారును నా మార్గమునే అనుసరించుచున్నారు.

౧౨. ఈ ఇహలోకమున కర్మసిద్ధి నభిలషించి (మానవులు) దేవతల నుపాసింతురు. ఏలన, కర్మసిద్ధి ఈ మానవలోకమున త్వరితముగాకలుగును.

౧౩. గుణములను కర్మములను విభజించుటచేత నేను నాలుగు కులముల నేర్పఱచితిని. ఈ చాతుర్వర్ణ్యమునకు నేనే కర్తను. ఐనను నేను మార్పు లొందనివాడను, కర్మము లొనర్పనివాడను, అని యెఱుగుము.

౧౪. కర్మములు నన్ను అంటవు. కర్మఫలములయెడ నాకు ఆసక్తి

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥ ౧౫
కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥
కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యఞ్చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ ౧౭
కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ ౧౮
యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః ॥ ౧౯

---

లేదు. ఇట్లు (ఆత్మరూపునిగ) నన్నెఱిగినవాడు కర్మములచే కట్టుపడడు.

౧౫. ఇట్లెఱిగి పూర్వకాలపు మోక్షార్థులుకూడ కర్మమొనర్చిరి. ప్రాచీనులు పూర్వమెట్లు కర్మమొనర్చిరో నీవును అట్లే కర్మమొనర్పుము.

౧౬. ఏది కర్మము, ఏది అకర్మము అని నిర్ణయించుటలో సిద్ధపురుషులుకూడ మూఢతనొందుదురు. కావున దేని నెఱిగినచో నీవు సంసార చక్రమునుండి విముక్తుడ వగుదువో అట్టిదానిని — కర్మమెట్టిది అను విషయమును — నీకు తెలిపెదను.

౧౭. ఏలన, కర్మముయొక్క తత్త్వము నెఱుగుట ఆవశ్యకము. వికర్మము (చేయగూడని కర్మము) యొక్కయు, అకర్మముయొక్కయు తత్త్వముకూడ గ్రహింపవలెను. కర్మస్వభావము గ్రహింపనశక్యమైనది.

౧౮. కర్మము (కర్తృత్వబుద్ధినివీడి చేయు క్రియ) లో అకర్మమును (బంధరాహిత్యము), అకర్మము (మిన్నకుండియు కర్తృత్వబుద్ధి కలిగియుండుట) లో (బంధించు) కర్మమును చూచువాడే మేధావి, వాడే యోగి, వాడే సర్వకర్మము లొనర్చువాడు (కర్మలక్ష్యమగు ముక్తిని సాధించువాడు).

౧౯. ఎవని కర్మము లన్నియూ ఫలవాంఛారహితములో, కర్తృత్వాభి

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్కరోతి సః ॥ ౨౦

నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ ౨౧

యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః ।
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥ ౨౨

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ ౨౩

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ ౨౪

---

మానసశూన్యములో, జ్ఞానాగ్నిచేత ఎవనికర్మములు దహింపబడునో, వానిని జ్ఞానులు ప్రాజ్ఞు డందురు.

౨౦. కర్మఫలాసక్తిని వీడి, సదా సంతృప్తుడై, దేనిమీదను ఆధార పడక, యుండువాడు, కర్మము లొనర్చినను, ఒనర్పనివాడే అగుచున్నాడు.

౨౧. వాంఛాశూన్యుడై, మనశ్శరీరములను వశపఱుచుకొని, సర్వ స్వమును విడనాడినవాడు, కేవలశారీరకర్మ మొనర్చుటచేత పాపపుణ్యరూప బంధనముల నొందడు.

౨౨. అప్రయత్నలబ్ధములగువానితో సంతుష్టుడై, సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుడై, ఈర్ష్యారహితుడై, కార్యసిద్ధిని అసిద్ధిని సమబుద్ధితో చూచుచు, ఉండువాడు కర్మ మొనర్చినను బద్ధుడుకాడు.

౨౩. ఆసక్తిరహితుడు, విముక్తుడు, జ్ఞానమందు సుప్రతిష్ఠితబుద్ధి గలవాడు, చేయు కర్మ మంతయు — యజ్ఞార్థమే (లోకకల్యాణార్థమే) గనుక — లయించిపోయి బంధింపదు.

౨౪. అతని బుద్ధికి అర్పణకర్మము బ్రహ్మము, అర్పింపబడుహవిస్సు బ్రహ్మము, హోమాగ్ని బ్రహ్మము, అర్పించువాడు బ్రహ్మము; ఇట్లు కర్మ

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥ ౨౫
శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి॥ ౨౬
సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ ౨౭
ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః॥ ౨౮
అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥ ౨౯

---

రూపుడగు బ్రహ్మమందు నిమగ్నుడై యుండువాడు బ్రహ్మమునే పొందును.

౨౫. ఇతరయోగులు దేవతల నుద్దేశించి యజ్ఞము చేయుదురు. మఱి కొందఱు బ్రహ్మాగ్నియందు ఆత్మవలన తమ ఆత్మనే ఆహుతిగా (యజ్ఞబుద్ధితో) నర్పింతురు (జీవాత్మనంటుకొనియుండు ఉపాధుల నాహుతిచేసి ఉపాధి రహితాత్మను చూతురు).

౨౬. ఇతరయోగులు చెవులుమున్నగు ఇంద్రియములను నిగ్రహ మనెడి అగ్నిలో వేల్చుచున్నారు. ఇంకను ఇతరులు శబ్దాదిఇంద్రియవిషయ ములను (ధర్మవిరుద్ధములుకానివానిని) ఇంద్రియరూపాగ్నిలో వేల్తురు.

౨౭. మఱికొందఱుయోగులు జ్ఞానప్రదీప్తమగు ఆత్మనిగ్రహ మనెడు యోగాగ్నిలో ఇంద్రియకర్మముల నన్నిటిని, ప్రాణవాయువు మున్నగువాని కర్మముల నన్నిటిని, ఆహుతి యొనగుదురు.

౨౮. ఇంకనుఇతరులు ద్రవ్యదాన మను యజ్ఞమును, తపోరూప మగు యజ్ఞమును, ప్రాణాయామాదులతోకూడిన యోగయజ్ఞమును, ఒన ర్తురు. వశీకృతాత్ములును, దృఢవ్రతులును అగువారు వేదాభ్యాసమును, జ్ఞాన మును, యజ్ఞబుద్ధితో అనుష్ఠింతురు.

అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి ।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షయితకల్మషాః ॥ ౩౦
యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥ ౩౧
ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ ౩౨
శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః పరన్తప ।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ ౩౩

---

౨౯ - ౩౦ (౧). మఱికొందఱు సర్వదా ప్రాణాయామము నభ్యసించుచు, అపానవాయువు (విడుచుగాలి) నందు ప్రాణవాయువును (పీల్చుకొను గాలి), ప్రాణవాయువునందు అపానవాయువును, ఆహుతిగా అర్పింతురు; ప్రాణాపానవాయువుల రాకపోకలను నిరోధింతురు; ఇంకకొందఱు ఆహారమును కట్టడలో పెట్టి, ప్రాణములందు ఇతరప్రాణముల నెల్ల ఆహుతి యొనర్తురు (అన్నియు కలిసి ఐక్యమందునట్లు).

(౨౫-వ శ్లోకము మొదలు ఇంతవఱకు పేర్కొనబడిన కర్మములన్నియు యజ్ఞకర్మములుగా భావించి చేయునవేగాని, నిజమగు యజ్ఞకర్మములు కావు).

౩౦ (౨) - ౩౧. వీ రెల్లరును యజ్ఞమనగా ఏమైనది ఎఱుగుదురు. యజ్ఞముచేయువారు విగతపాపులై, యజ్ఞశేషమును (దీనికి అమృతమని పేరు) భుజించి, శాశ్వతబ్రహ్మమును చేరుదురు. యజ్ఞము లొనర్పనివాడు ఈ లోకమునకే అనర్హుడు; వాని కిక పరలోకప్రాప్తి యెట్లు ?

౩౨. పైని పేర్కొనినవానివంటి వివిధయజ్ఞములు వేదమున వెదజల్లబడి యున్నవి. అవన్నియు కర్మమునుండి కలిగినవి (ఆత్మనుండికాదు) అని గ్రహింపుము. అవి అట్టివి అని ఎఱిగినచో నీవు ముక్తినొందుదువు.

౩౩. భౌతికవస్తువులతో చేయబడు యజ్ఞమునకన్న జ్ఞానయజ్ఞము

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ ౩౪
యజ్జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాణ్డవ ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ ౩౫
అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి ॥ ౩౬
యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ ౩౭
న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥ ౩౮

---

శ్రేయస్కరము. ఏలన కర్మ మంతయు పూర్తిగా జ్ఞానమునందే పరిసమాప్తమగును.

౩౪. సాష్టాంగప్రణామములు చేసియు, ప్రశ్నించియు, శుశ్రూషించియు దానిని గ్రహింపుము. సత్య (బ్రహ్మ) జ్ఞానానుభూతి నొందినజ్ఞానులు ఆ జ్ఞానమును నీకు ఉపదేశింతురు.

౩౫. ఆ జ్ఞానమును గ్రహించితివేని, నీవు మరల నిట్లు మూఢతలో పడవు; సృష్టినంతయు నీ ఆత్మయందును, నాయందును చూతువు.

౩౬. పాపు లందఱిలో మహాపాపిష్ఠుడవైనను, జ్ఞానమనెడు తెప్ప వలననే నీవు సమస్తపాపమును దాటుదువు.

౩౭. ప్రజ్వలించుచుండు అగ్ని కట్టెలను భస్మీకరించునట్లు, జ్ఞానమనెడు అగ్ని కర్మమునంతయు భస్మీకరించును.

౩౮. ఈ లోకమున జ్ఞానమువంటి శుద్ధికరవస్తు వేదియు లేదు. యోగము (చూడుః అ. 2, శ్లో. 48) చేత సిద్ధత్వమొందినవాడు కాలపరిపాకమున ఆ (బ్రహ్మ) జ్ఞానమును తనయందే పొందును.

శ్రద్ధావాంల్లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి ॥ ౩౯

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥ ౪౦

యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం ।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ॥ ౪౧

తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత ॥ ౪౨

జ్ఞానకర్మసంన్యాసయోగో నామ
చతుర్థోఽధ్యాయః

---

౩౯. శ్రద్ధయు, ఏకాగ్రభక్తియు, గల జితేంద్రియుడు (ఈ) జ్ఞానమును పొందును. జ్ఞానము కలిగినవెంటనే పరమశాంతి (ముక్తి) లభించును.

౪౦. ఆత్మజ్ఞానరహితుడు, (గురుబోధయందు) శ్రద్ధాహీనుడు, సంశయాత్ముడు, నాశిల్లును. సంశయాత్మునికి ఇహలోకముగాని, పరలోకముగాని, సుఖముగాని, లేదు.

౪౧. యోగఫలముగా (సకామ) కర్మమును విడనాడి, జ్ఞానమువలన సంశయము లన్నియు పోగొట్టుకొని, ఆత్మయందు సుప్రతిష్ఠితు డగువాడు కర్మములచే బద్ధుడుకాడు.

౪౨. కాన, అజ్ఞానమువలన కలిగి నీ హృదయమున నిలిచియున్న ఈ (ఆత్మనుగూర్చిన) సంశయమును జ్ఞానమనెడు ఖడ్గముతో ఛేదించి, (నిష్కామ) యోగము నాశ్రయింపుము. అర్జునా, లెమ్ము.

***"జ్ఞానకర్మసంన్యాసయోగము" అను పేరుగల
నాల్గవ అధ్యాయము సమాప్తము.



# పంచమాధ్యాయము



## సంన్యాసయోగము

అర్జున ఉవాచ:—

సంన్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥ ౧

శ్రీభగవానువాచ:—

సంన్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసంన్యాసాత్కర్మయోగో విశిష్యతే ॥ ౨
జ్ఞేయః స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి ।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే॥ ౩

---

అర్జునుడు పలికెను :—

౧. కృష్ణా, కర్మసన్న్యాసమును ప్రశంసించి, మరల కర్మాచరణమును ప్రశంసించుచున్నావు. ఈ రెంటిలో ఏది యెక్కువశ్రేయస్కరమో తేల్చి చెప్పుము.

శ్రీ భగవానుడు పలికెను :—

౨. కర్మసన్న్యాసము, కర్మాచరణము, ఈ రెండును మోక్షసాధనములే. వీనిలో కర్మసన్న్యాసముకన్న కర్మాచరణము ఎక్కువశ్రేయస్కరము.

3. రాగద్వేషరహితు డగువాడు (సన్న్యసింపకున్నను) ఎల్లప్పుడును సన్న్యాసియే. ఏలన, ద్వంద్వాతీతు డగువాడు సంసారబంధమునుండి సులభముగా విముక్తు డగును.

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః।
ఏకమప్యాస్థితః సమ్యగుభయోర్విన్దతే ఫలమ్॥ ౪

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥ ౫

సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి॥ ౬

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥ ౭

నైవ కిఞ్చిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।
పశ్యఞ్శృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్॥ ౮

---

౪. జ్ఞానము, కర్మాచరణము, వేఱైనవనెడువారు అజ్ఞులు, జ్ఞానులు కారు. ఇందు ఏ యొకదానియందైన సుప్రతిష్ఠితుడైనవాడు రెంటిఫలమును పొందును.

౫. జ్ఞానులే స్థానమును చేరుదురో, కర్మయోగులును ఆ స్థానమునే చేరుదురు. జ్ఞానము, కర్మాచరణము, అభిన్నములుగా చూచువానిదే సమ్యగ్ (యథార్థ) దృష్టి.

౬. కర్మానుష్ఠానములేకుండ కర్మసన్న్యాసమును పొందుట మిక్కిలి కష్టము. ధ్యానశీలి (ముని) కర్మాచరణనిష్ఠచేత పరిశుద్ధుడై త్వరితముగా బ్రహ్మమును చేరును.

౭. కర్మాచరణపరాయణతచేత శుద్ధినొందిన మనస్సు, వశీకృతమైన దేహము, నిగ్రహింపబడిన ఇంద్రియములు కలిగి, సమస్తజీవుల ఆత్మను తన ఆత్మగనేచూచు కర్మయోగి కర్మమొనరించినను దానిచేత అంటుబడడు.

౮-౯. సత్యా (బ్రహ్మ)ను భూతి గల కర్మయోగి ఆత్మయందు సుప్రతిష్ఠితుడై, చూచుచు, వినుచు, తాకుచు, వాసనచూచుచు, తినుచు,

ప్రలపన్విసృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥ ౯

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా ॥ ౧౦

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే ॥ ౧౧

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ ౧౨

సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥ ౧౩

---

నడచుచు, నిద్రించుచు, గాలిపీల్చుచు, మాటాడుచు, విసర్జించుచు, పరిగ్రహించుచు, కన్నులుతెఱచుచు, మూయుచు, ఉండియు, "ఇంద్రియములు ఇంద్రియవిషయములందు ప్రవర్తించుచున్నవి, నే నేమియు చేయుటలేదు" అని తలచును.

౧౦. ముక్తసంగుడై కర్మము లొనర్చుచు, వానిని పరమేశ్వరార్పితము చేయువాడు — నీటిచేత తామరాకు అంటబడనట్టు — పుణ్యాపాపములచేత అంటబడడు.

౧౧. నిష్కామకర్మయోగులు సంగరహితులై — శరీరముతో, మనస్సుతో, బుద్ధితో, ఇంద్రియములతో మాత్రమే (అనగా కర్తృత్వబుద్ధిరహితులై) —చిత్తశుద్ధికొఱకు కర్మమొనర్తురు.

౧౨. సమబుద్ధియందు సుస్థిరుడగువాడు కర్మఫలమును విసర్జించి, జ్ఞానమార్గమున సిద్ధినొందుచు, శాంతినొందును. సమబుద్ధిరహితుడు, వాంఛావశుడై, కర్మఫలాసక్తిచే బద్ధుడగును.

౧౩. జితేంద్రియుడు వివేకబుద్ధివలన కర్మములనెల్ల త్యజించి,

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥ ౧౪

నాదత్తే కస్యచిత్ పాపం న చైవ సుకృతం విభుః।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః॥ ౧౫

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః।
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥ ౧౬

తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః।
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥ ౧౭

---

నవద్వారయుక్తమగు దేహనగరమున — తా నేమియు చేయక, ఇతరులచేత చేయింపక — సుఖముగా వసించుచుండును.

౧౪. కర్తృత్వబుద్ధిని, కర్మములను, లోకమున సృజించునదియు; కర్మములను వానిఫలములతోకూర్చునదియు, పరమేశ్వరుడు కాడు. ఇదంతయు చేయునది ప్రకృతి (సర్వవ్యాపియగు అవిద్య).

౧౫. సర్వగతుడగు పరమేశ్వరుడు ఎవరి పాపపుణ్యములనుగాని గ్రహింపడు. అజ్ఞానముచే జ్ఞానము కప్పవడినది. అందుచేత జీవులు మూఢతనొందుచున్నారు.

౧౬. ఆత్మజ్ఞానముచేత ఎవరి అజ్ఞానము నశించునో, వారి ఆ జ్ఞానము — సూర్యునివలె — బ్రహ్మమును ప్రకాశింపజేయును.

౧౭. ఎవరిబుద్ధి బ్రహ్మమునందే కూడియుండునో, ఎవరి ఆత్మ బ్రహ్మమేఅయియుండునో, ఎవరు బ్రహ్మమునందే నిష్ఠ గలవారో, ఎవరికి బ్రహ్మమే పరమార్థమో, ఎవరిపాపములు జ్ఞానముచే ఎగురగొట్టబడినవో, వారు (అపునరావృత్తి) మోక్షమునొందుదురు.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః ॥ ౧౮

ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥ ౧౯

న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।
స్థిరబుద్ధిరసంమూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ ౨౦

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥ ౨౧

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః॥ ౨౨

---

౧౮. విద్యావినయసంపదగల బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్కను, కుక్కలనుతినువానిని, ఆత్మజ్ఞానులు సమదృష్టితో (ఆత్మగనే) చూతురు.

౧౯. ఎవరిబుద్ధి సమభావమున సునిష్ఠితమగునో, వా రీ లోకముననే సంసారబంధమును జయింతురు. బ్రహ్మ సముడును, దోషరహితుడును, గనుక వారు బ్రహ్మమునందే సునిష్ఠితులగుదురు.

౨౦. బ్రహ్మజ్ఞుడు బ్రహ్మమందే ప్రతిష్ఠితుడై, సుస్థిరబుద్ధిగలిగి, అసమ్మూఢుడై, ప్రియవస్తుప్రాప్తికి హర్షింపక, అప్రియవస్తుప్రాప్తికి విషాద మొందక, యుండును.

౨౧. బాహ్యవిషయములం దనసక్తాత్ముడగువాడు ఆత్మానుభూతిచేత కలుగు సుఖమును పొందును. బ్రహ్మధ్యాననిమగ్నచిత్తముతో అతడు అక్షయానందము ననుభవించును.

౨౨. విషయస్పర్శవలన కలుగు సుఖములు దుఃఖకారణములు, ఆద్యంతములుకలవి, అగుటచేత జ్ఞాని వానివలనిసుఖమును కోరడు.

శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥ ౨౩

యోఽన్తఃసుఖోఽన్తరారామస్తథాఽన్తర్జ్యోతిరేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ ౨౪

లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥ ౨౫

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ ౨౬

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ ॥ ౨౭

---

౨౩. ఇహలోకమందే, శరీరపతనపూర్వమే, ఎవడు కామక్రోధోద్వేగమును నిగ్రహింపగలడో, అతడు యోగప్రతిష్ఠితుడు, అతడు సుఖి.

౨౪. ఆత్మయందే సుఖించుచు, ఆత్మయందే క్రీడించుచు, ఆత్మయందే జ్ఞానజ్యోతిని చూచుచుండు యోగియే బ్రహ్మస్వరూపుడై (బ్రహ్మనిర్వాణము) సశరీరమోక్షము నందును.

౨౫. లోపము లన్నియు పోగొట్టుకొని, సంశయరహితులై, ఇంద్రియములను జయించి, సర్వభూతములకు హితమొనర్చుచు, ఋషులు సశరీరమోక్షము నొందుదురు.

౨౬. కామక్రోధవిముక్తులై, వశీకృతచిత్తులై, ఆత్మజ్ఞానానుభూతి నందిన సన్న్యాసులు దేహపతనపూర్వమును, అనంతరమునుకూడ మోక్షానందము ననుభవింతురు.

౨౭-౨౮. బాహ్యవిషయములను మనస్సునుండి వెలువరించి; దృష్టిని కనుబొమలనడుమనే నిలిపి; నాసికాంతరమున చరించు ప్రాణాపానవాయువులను సమానమొనర్చి; ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని అరికట్టి;

యతేన్ద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః ॥ ౨౮

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి॥ ౨౯

ఇతి సంన్యాసయోగో నామ
పఞ్చమోఽధ్యాయః

---

మోక్షమునే పరమలక్ష్యముగానుంచుకొని; కామక్రోధభయములనువీడియుండు ముని శాశ్వతసుఖము నొందినవాడే.

౨౯. నన్ను యజ్ఞములయొక్కయు, తపస్సులయొక్కయు, భోక్తగా (మూలమును, గమ్యమును అగు సర్వకర్మఫలప్రదాతగా), లోకము లన్నిటికి మహేశ్వరునిగా, సర్వభూతమిత్రునిగా, ఎఱిగి అతడు శాంతినొందును.

***"సన్న్యాసయోగము" అను పేరుగల
ఐదవ అధ్యాయము సమాప్తము.



# షష్ఠాధ్యాయము



## ధ్యానయోగము

శ్రీభగవానువాచ:—

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సంన్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః॥ ౧

యం సంన్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాణ్డవ।
న హ్యసంన్యస్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన॥ ౨

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే॥ 3

యదా హి నేన్ద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే।
సర్వసఙ్కల్పసంన్యాసీ యోగారూఢస్తదోచ్యతే॥ ౪

---

శ్రీభగవానుడు పలికెను:—

౧. కర్తవ్యములుగ విధింపబడిన కర్మములను — "నిత్యకర్మము" లను — కర్మఫలాసక్తిలేక ఆచరించువాడే సన్న్యాసి, అతడే యోగి — యజ్ఞాదులను త్యజించినవాడు కాడు, తపస్తటాకనిర్మాణాదికర్మములను త్యజించినవాడును కాడు.

౨. సన్న్యాస మనునది కర్మయోగమే అని తెలియుము. ఏలన సంకల్పమును త్యజింపనివా డెవడును కర్మయోగి కానేరడు.

3. చిత్తశుద్ధిచే యోగమును సాధింపదలచు ధ్యానశీలునికి నిష్కామ కర్మానుష్ఠానమే మార్గమని చెప్పుదురు. యోగసిద్ధిని పొందినవానికి కర్మమును వీడుటే మార్గ మందురు.

౪. సంకల్పముల నెల్ల వీడి, ఇంద్రియవిషయములందును, కర్మము

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః ॥ ౫

బన్ధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ ౬

జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానాపమానయోః ॥ ౭

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః ॥ ౮

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబన్ధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ ౯

---

లందును ఆసక్తిలేక, యుండువానిని "యోగారూఢుడు" (యోగసిద్ధుడు) అందురు.

౫. మానవుడు ఆత్మవలననే (ఆత్మను) తన్ను ఉద్ధరించుకోవలెను. కావున ఆత్మను బలహీనమొనర్చుకోరాదు. ఏలన ఈ ఆత్మకు ఆత్మయే బంధువు, ఆత్మయే శత్రువు.

౬. (సవివేకమగు)ఆత్మ యొక్క తోడ్పాటుతో దేహేంద్రియసంఘాతమును లోబఱచుకొన్నవానికి ఈ ఆత్మ బంధువు. కాని లోబఱచుకొననివానికి ఈ ఆత్మయే శత్రువై, (బాహ్య) శత్రువువలె వర్తించును.

౭. వశీకృతాత్ముడు, ప్రశాంతుడు అగువాడు, శీతోష్ణ, సుఖదుఃఖ, సన్మానతిరస్కారములందు—ఎల్లప్పుడును—పరమాత్మనే చూచుచుండును.

౮. జ్ఞానవిజ్ఞానములవలన సంతుష్టచిత్తుడైనవాడు, నిర్వికారుడు, ఇంద్రియవిజయము సాధించినవాడు, మట్టిపెళ్లను, రాతిని, బంగారును సమబుద్ధితోచూచువాడు, అగు యోగిని "యుక్తుడు" అందురు.

౯. శ్రేయోభిలాషిని, మిత్రుని, శత్రుని, జోలిలేనివానిని, మధ్యస్థుని

యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥ ౧౦
శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్॥ ౧౧
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగమాత్మవిశుద్ధయే॥ ౧౨
సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్॥ ౧౩
ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః।
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥ ౧౪

---

ద్వేషించువానిని, బంధుని, సాధువును, పాపిని, సమబుద్ధితో చూచువాడు అత్యుత్తముడు.

౧౦. యోగి ఎల్లప్పుడు నిర్జనస్థానమున, ఏకాకియై యుండి, మనోబుద్ధులను వశపఱచుకొని, కోర్కులను, కలిమిని వీడి, మనస్సును సదా ధ్యాననిష్ఠయందు ఏకాగ్రమొనర్ప యత్నింపవలెను.

౧౧. మిక్కిలి ఎత్తుకాక, మిక్కిలి పల్లముకాక, పరిశుభ్రముగానుండు చోట తన ఆసనమును సుస్థిరముగా ఏర్పఱచుకొని, దానిపై వరుసగా దర్భాసనమును, చర్మాసనమును, ఒకవస్త్రమును పఱచుకొని;

౧౨. అచట ఆ ఆసనమునకూర్చుండి; మనస్సు నేకాగ్రమొనర్చి; చిత్త, ఇంద్రియ కార్యములను అరికట్టినవాడు చిత్తశుద్ధికొఱకు యోగము నభ్యసింపవలెను.

౧౩. శరీరమును, శిరస్సును, కంఠమును సమానముగా, సుస్థిరముగా, నిశ్చలముగా, నిలిపి; నాసికాగ్రమును చూచుచున్నట్లు దృష్టిని కేంద్రీకరించి; దిక్కులుచూడక;

౧౪. ప్రశాంతచిత్తుడును, నిర్భయుడును, బ్రహ్మచర్యవ్రతనిష్ఠుడును,

యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ ౧౫

నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్తమనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ ౧౬

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ ౧౭

యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।
నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ ౧౮

యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః ॥ ౧౯

---

అయి; మనస్సును నిరోధించి; నాయందే బుద్ధినిలిపి; నన్ను పరమలక్ష్యముగా ఉంచుకొని; యోగమున కూర్చుండవలెను.

౧౫. ఇట్లుమనస్సు నెప్పుడును సుస్థిరముగా నుంచుకొని, వశీకృతచిత్తుడగుయోగి నాయందు గల—మోక్షమున పర్యవసించు—శాంతినిపొందును.

౧౬. అత్యధికముగనో, అతిస్వల్పముగనో, భుజించువానికి; అత్యధికముగనో, అతిస్వల్పముగనో నిద్రించువానికి; యోగసిద్ధి కలుగదు.

౧౭. ఆహారవిహారములందు, కర్మాచరణోద్యమమందు, నిద్రించుటందు, మేల్కొనియుండుటందు, పరిమితి నవలంబించువానికి యోగము దుఃఖనాశక మగును.

౧౮. పూర్తిగా నిరోధింపబడిన చిత్తము సర్వకామవివర్జితమై, నిఃస్పృహమై, ఆత్మయందే ప్రశాంతముగా ఎప్పుడు నిలిచియుండునో, అప్పుడు అట్టివాడు "యుక్తుడు" (సమాహితచిత్తుడు) అనబడును.

౧౯. మనోనిగ్రహము కలిగి, ఆత్మయోగము నభ్యసించు యోగి విషయమున, "గాలిలేనిచోట దీప మెట్లు చలింపకుండునో" అనెడు ఉపమానము చెప్పబడినది.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥ ౨౦
సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥ ౨౧
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥ ౨౨
తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥ ౨౩
సఙ్కల్పప్రభవాన్కామాంస్త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥ ౨౪

---

౨౦-౨౩. యోగాభ్యాసమువలన పూర్తిగా నిరోధింపబడిన మనస్సు ఎప్పుడు శాంతినందునో; ఆత్మతో ఆత్మను చూచుచు మానవుడు తన ఆత్మ యందే ఎప్పుడు సంతుష్టినందునో; నిర్మలతనొందిన బుద్ధికిమాత్రమే గోచరించు ఇంద్రియాతీతమగు ఆనందాతిశయమును — దేనియందు సుప్రతిష్ఠితుడైనపిదప తన వాస్తవస్థితినుండి అత డెప్పుడును చలింపడో అట్టి ఆనందాతిశయమును — అత డెప్పు డనుభవించునో; ఏది లభించినపిదప మఱే లాభమును అంతకన్న అధికమైనదానినిగా అతడు భావింపడో; దేనియందు సుప్రతిష్ఠితుడైనపిదప దుర్భరమహాదుఃఖమువలనగూడ అతడు చలింపకుండునో; దుఃఖముతోడికూడికను పోగొట్టు అస్థితిని "యోగము" అందురని ఎఱుగవలెను. ఆ యోగమును విసుగులేనిచిత్తముతో, పట్టుదలతో, అభ్యసింపవలెను.

౨౪. సంకల్పమువలన కలుగు సర్వవాంఛలను నిశ్శేషముగా త్యజించి; ఇంద్రియసమూహము నంతయు సర్వదిశలం దుండు తద్విషయములనుండి మనస్సుతోనే మరల్చి;

శనై శ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥ ౨౫

యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥ ౨౬

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్॥ ౨౭

యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే॥ ౨౮

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ ౨౯

---

౨౫. బుద్ధిని తాలిమివహింపజేసి, మనస్సును ఆత్మబద్ధ మొనర్చి, అతడు మెలమెల్లగా శాంతిని సాధింపవలెను; దేనినిగూర్చిగాని తలంపరాదు.

౨౬. చంచలమును, అస్థిరమును, అగు మనస్సు, ఏకారణముచేత పరుగిడిపోయినను, దానినుండి మరల్చి, ఆత్మవశముననే ఉండునట్లు చేయవలెను.

౨౭. ప్రశాంతచిత్తుడు, :కామక్రోధాది ఉద్రేకకారణముల కతీతుడు, సర్వము బ్రహ్మమేయను అనుభూతినొందినవాడు, నిష్కల్మషుడు, అగు యోగి పరమసుఖప్రాప్తి నందును.

౨౮. (పాపపుణ్య)కల్మషరహితుడై, మనస్సును సదా ఇట్లే వినియోగించుచుండు యోగి బ్రహ్మముతోడికూడికచే కలుగు పరమసుఖమును సులభముగా పొందును.

౨౯. యోగముచే ఏకాగ్రతనొందిన చిత్తముతో, సర్వభూతములను సమముగా చూచు దృష్టితో, అతడు సర్వభూతములందు ఆత్మను, ఆత్మయందు సర్వభూతములను చూచును.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ ౩౦

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ ౩౧

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ ౩౨

అర్జున ఉవాచ :—

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన।
ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్॥ ౩౩

చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ ౩౪

---

౩౦. సర్వభూతములలో నన్నును, నాయందు సర్వభూతములను, చూచువాడు నాయొద్దనుండి యెన్నడు విడివడడు; నే నతనినుండియు విడివడను.

౩౧. ఎవడు ఏకత్వమందు సుప్రతిష్ఠితుడై, సర్వభూతములం దుండు నన్ను ఆ భూతములలోని ఆత్మనిగా భజించునో, అతడు ఎట్లు జీవించు చున్నను నాయందే జీవించును.

౩౨. ఎల్లెడలనుండు సుఖదుఃఖములను తన సుఖదుఃఖములతో పోల్చియే — వానితో సమముగనే — చూచు యోగి పరమశ్రేష్ఠుడుగా ఎన్నబడును.

అర్జునుడు పలికెను :—

౩౩. కృష్ణా, నీ విప్పుడు సమబుద్ధితోకూడినదని బోధించిన యోగము —మనస్సుయొక్క చంచలస్వభావమువలన — సుస్థిరముగా ఉండగలదని నాకు తోచుటలేదు.

౩౪. మనస్సు చంచలమును, సంక్షోభకరమును, బలయుతమును;

శ్రీభగవానువాచ:—

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥ ౩౫
అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః॥ ౩౬

అర్జున ఉవాచ:—

అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి॥ ౩౭
కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి॥ ౩౮

---

దృఢమును, అయినది. దానిని వశపఱచుకొనుట వాయువును అరికట్టు టెంతకష్టమో, అంత కష్టమని నాకు తోచుచున్నది.

శ్రీభగవానుడు పలికెను:—

౩౫. అర్జునా, నిస్సంశయముగా మనస్సు చంచలమే; దానిని నిగ్రహించుట కష్టమే; కాని అభ్యాసమువలనను, వైరాగ్యమువలనను, దానిని నిగ్రహింపవచ్చును.

౩౬. ఆత్మనిగ్రహము లేనివానికి యోగము సాధించుట దుష్కరమనియే నా అభిప్రాయము. కాని వశీకృతాత్ముడు యుక్తమార్గమున ప్రయత్నించి దానిని సాధింపవచ్చును.

అర్జునుడు పలికెను:—

౩౭. కృష్ణా, శ్రద్ధాయుక్తుడయ్యును, ఆత్మనిగ్రహవిహీనుడై, యోగమునుండి మనస్సు చలించుటచేత యోగభ్రష్టత నందినవాడు ఎట్టి గతిని పొందును ?

౩౮. అతడు కర్మజ్ఞానమార్గములురెంటినుండి భ్రంశమునొంది, నిరాధారుడై, బ్రహ్మమునుచేరుమార్గమున విమూఢతనొంది, చెదరిన మేఘమువలె నశింపడా ?

ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః।
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే॥ ౩౯

శ్రీభగవానువాచ:—

పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే।
నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి॥ ౪౦

ప్రాప్య పుణ్యకృతాంల్లోకానుషిత్వా శాశ్వతీః సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ ౪౧

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥ ౪౨

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునన్దన॥ ౪౩

---

౩౯. నా యీ సంశయమును నీవు నిశ్శేషముగా తీర్పవలెను; ఏలన, నీవుతప్ప ఇతరులు దీనిని తీర్ప ననర్హులు.

శ్రీభగవానుడు పలికెను:—

౪౦. అర్జునా, వాని కీ లోకమునగాని, పరలోకమునగాని, వినాశము ఉండదు. ఇది నిస్సంశయము. ఏలన వత్సా, శుభకార్యాచరణునకు ఎన్నటికిని దుర్గతి కలుగదు.

౪౧. యోగభ్రష్టుడు పుణ్యాత్ములుపోవు లోకములను పొంది, అచ్చట అత్యంతకాలము నివసించి, పవిత్రవర్తనులును, శ్రీమంతులును అగువారి యింట జన్మించును.

౪౨. లేక, ప్రాజ్ఞులగు యోగులవంశముననే జన్మించును. ఈ లోకమున అట్టి జన్మము అత్యంతదుర్లభము.

౪౩. అచ్చట, పూర్వదేహమున ఆర్జింపబడిన బుద్ధి (సంస్కారము)తో సంయోగమునంది, అతడు సిద్ధత్వముకై పూర్వముకన్న అధికముగా పరిశ్రమించును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ ౪౪

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥ ౪౫

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ ౪౬

యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా ।
శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ ౪౭

ఇతి ధ్యానయోగో నామ

షష్ఠోఽధ్యాయః

---

౪౪. ఆ పూర్వాభ్యాసబలమువలననే అతడు — అవశముగా — ముందుకు లాగుకొనిపోబడును. యోగస్వభావము నెఱుగగోరువాడుకూడ వేదనిర్దిష్టకర్మాచరణపరాయణుని అతిక్రమించును.

౪౫. ప్రయత్నశీలుడై పూర్ణముగా పరిశ్రమించు యోగి పాపవిమోచనముచేత పరిశుద్ధినొంది, అనేకజన్మములలో క్రమక్రమముగా సంసిద్ధినందుచు, పరమగమ్యమును పొందును.

౪౬. అతడు తపస్విజనులకన్నను, శాస్త్రజ్ఞానులకన్నను, అధికుడుగా ఎన్నబడును. వేదోక్తకర్మానుష్ఠానపరులకన్నను అధికుడు. కావున నీవు యోగి వగుము.

౪౭. ఎవని యంతరాత్మ నాయందే మగ్నమై యుండునో, ఎవడు శ్రద్ధావంతుడై నన్ను భజించుచుండునో, అట్టివానిని నేను యోగు లందఱిలో యుక్తతమునిగా నెంతును.

***"ధ్యానయోగము" అను పేరుగల

ఆఱవ అధ్యాయము సమాప్తము.



# సప్తమాధ్యాయము



## జ్ఞానవిజ్ఞానయోగము

శ్రీభగవానువాచ:—

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥ ౧

జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞాతవ్యమవశిష్యతే॥ ౨

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3

---

శ్రీభగవానుడు పలికెను:—

౧. అర్జునా, మనస్సు నాపై నిలిపి, నన్నాశ్రయించి, యోగము నభ్యసించినచో, ఎట్లు నా సంపూర్ణస్వరూపము నెఱుగగలవో వినుము.

౨. నేను నీకు విజ్ఞానముతోకూడిన ఈ జ్ఞానమును (అ, 3, శ్లో. ४౧.) సంపూర్ణముగా తెలిపెదను. అది గ్రహించినచో ఈ లోకమున నీవు మరల తెలిసికొనవలసినదేదియు మిగిలియుండదు.

3. వేనవేలమంది మానవులలో ఎవడోయొకడే జ్ఞానసిద్ధికై యత్నించును. అట్లు యత్నించు ముముక్షువులలోకూడ ఎవడోఒకడే నన్ను యథార్థముగా తెలిసికొనును.

భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ ౪

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ ౫

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా ॥ ౬

మత్తః పరతరం నాన్యత్కిఞ్చిదస్తి ధనఞ్జయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ ౭

రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః ।
ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ ౮

---

౪. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, అను ఎనిమిదివిధములుగా నా ప్రకృతి విభజింపబడి యున్నది.

౫. ఇది అపరా (జడ) ప్రకృతి. కాని దీనికన్న అన్యమగు నా పరా (ఉత్తమ) ప్రకృతి నెఱుగుము. చైతన్యరూపమగు దీనిచేతనే ఈ జగత్తు ధరింప(పోషింప)బడుచున్నది.

౬. ఈ ఉభయవిధప్రకృతినుండియే సర్వచేతనాచేతనభూతములు కలిగిన వనియు, అఖిలజగత్తుయొక్క ఉత్పత్తివిలయములకు నేనే కారణ మనియు ఎఱుగుము.

౭. నాకన్న అధికము, ఇతరము, ఏమియు లేదు. దారమున మణి గణమువలె ఇదంతయు నాయందు గ్రువ్వబడియున్నది.

౮. నీటియందలి రసమను నేనే. సూర్యచంద్రులందలికాంతిని నేనే. వేదములందలి ఓంకారమను, ఆకసమందలి శబ్దమను, నరులందలి పౌరుషమను నేనే.

పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ ౯

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥ ౧౦

బలం బలవతామస్మి కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ ౧౧

యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే ।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ ౧౨

త్రిభిర్గుణమయైర్భావైరేభిః సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥ ౧౩

---

౯. భూమియందలి సుగంధమును, అగ్నియందలి తేజమును, సర్వజీవులందలి జీవమును, తపస్విజనులందలి తపస్సును నేనే.

౧౦. సర్వభూతములకు నిత్యబీజమును, బుద్ధిమంతు లందఱిలోని బుద్ధిని, శూరులలోని శౌర్యమును, నేనే.

౧౧. బలవంతులలోని తృష్ణానురక్తిరహితమగు బలమును నేను. భూతములలోని — ధర్మబాహ్యముకాని — కామమును నేను.

౧౨. మఱియు సాత్త్వక, రాజసిక, తామసిక భావములు, ఏవేవి కలవో, అవన్నియు నాలోనుండియే ఉత్పత్తియైనవని ఎఱుగుము. కాని నేను వానియందు లేను, అవి నాయం దున్నవి.

౧౩. ప్రకృతిలోని త్రిగుణజాతములగు ఈ భావములచే మూఢతనంది, ఈ లోకము — వాని కతీతుడనై, మార్పులొందకుండు — నన్ను ఎఱుగకుండును.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ॥ ౧౪

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ ౧౫

చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ ౧౬

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః ॥ ౧౭

ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥౧౮

---

౧౪. త్రిగుణాత్మకమగు ఈ నా దైవీమాయను దాటుట మిక్కిలి కష్టము. కాని నన్నే ఆశ్రయించియుండువారు దీనిని దాటుదురు.

౧౫. దుశ్చరితులును, మూఢులును, మనుష్యాధములును, మాయావశులై వివేకమును కోల్పోయినవారును, క్రౌర్యానత్యాదుల ననువర్తించి నన్ను ఆశ్రయింపరు.

౧౬. నాల్గు విధముల పుణ్యపురుషులు నన్ను భజింతురు — ఆపదలోనున్నవాడు, జ్ఞానమునొందగోరువాడు, (ఇహపర) భోగములు కోరువాడు, జ్ఞాని.

౧౭. వారిలో సదా సమాహితచిత్తుడు, కేవలునందు ఏకాగ్రభక్తిపూరితుడు, అగు జ్ఞాని ఉత్తముడు. ఏలన జ్ఞానికినేను అత్యంతప్రియుడను ; అతడు నాకును ప్రియుడు.

౧౮. వీ రెల్లరు ఉదారబుద్ధి గలవారే ; కాని జ్ఞానిని నేను నన్నుగనే భావింతును ; ఏలన అత డేకాగ్రచిత్తముతో నన్నే పరమగమ్యముగా నెంచి, నాయందే నిలిచియుండును.

బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥ ౧౯

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా॥ ౨౦

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥ ౨౧

స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే।
లభతే చ తతః కామాన్మయైవ విహితాన్హి తాన్॥ ౨౨

అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।
దేవాన్దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥ ౨౩

---

౧౯. పెక్కుజన్మములు గడచినపిదప, ఈ సర్వమును వాసుదేవుడే అనెడు అనుభూతినంది, జ్ఞాని నన్ను ఆశ్రయించును. అట్టి మహాత్ముడు మిక్కిలి అరుదు.

౨౦. ఇతరులు వివిధవాంఛలచేత వివేకముకోల్పోయి, తమ ప్రకృతి ననుసరించి వివిధకర్మము లాచరించుచు, ఇతరదేవతల నాశ్రయింతురు.

౨౧. శ్రద్ధతో ఏ యే భక్తుడు ఏ యే దేవతామూర్తిని ఆరాధింపగోరునో. ఆయా భక్తునికి ఆ యా మూర్తియందే నిశ్చలశ్రద్ధను నేను కలిగింతును.

౨౨. ఆ శ్రద్ధతో అతడు ఆమూర్తినే భజించి, అందుచే అభీష్టసిద్ధి నందును. నిజమునకు ఈ ఫలముల నిచ్చునది నేనే.

౨౩. కాని ఈ అల్పబుద్ధులు పొందు ఫలము అంతముగలది. దేవతల నర్చించువారు దేవతలను చేరుదురు; న న్నర్చించువారు నన్ను చేరుదురు.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః ।
పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్ ॥ ౨౪

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥ ౨౫

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ ౨౬

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత ।
సర్వభూతాని సంమోహం సర్గే యాన్తి పరన్తప ॥ ౨౭

యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥ ౨౮

---

౨౪. అక్షయము, సర్వాతీతము, అగు నా పరమస్వరూపము నెఱుగక బుద్ధిహీనులు అవ్యక్తుడగునన్ను గోచరరూపముకలవానిగ (సామాన్య మానవునిగ) తలంతురు.

౨౫. యోగమాయ (త్రిగుణముల కూడికచే కలుగు మాయ)చే కప్పవడి నే నెలరకు గోచరింపను. ఈ మూఢప్రపంచము పుట్టుకలను, మార్పులను, లేని న న్నెఱుగదు.

౨౬. పూర్వ ముండిన, ఇప్ప డుండు, ఇక నుండబోవు, భూతముల నన్నిటిని నే నెఱుగుదును. కాని నన్ను ఎవడును ఎఱుగడు.

౨౭. అనురాగద్వేషజనితములగు ద్వంద్వములచే మూఢతనంది సర్వజీవులును పుట్టుకతోడనే భ్రాంతు లగుదురు.

౨౮. కాని పుణ్యకర్మము లొనర్చి పాపవిముక్తులగువారు ద్వంద్వ భ్రాంతినుండి విడివడి, దృఢవ్రతులై నన్ను భజింతురు.

జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్॥ ౨౯

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥ ౩౦

ఇతి జ్ఞానవిజ్ఞానయోగో నామ
సప్తమోఽధ్యాయః

---

౨౯. ముదిమినుండి, చావునుండి, తప్పించుకొన పరిశ్రమించువారు నా శరణుచొచ్చి, "బ్రహ్మము"ను, "అధ్యాత్మము" నంతయు, అఖిల "కర్మమును" ఎఱుగుదురు.

౩౦. "అధిభూత", "అధిదైవ", "అధియజ్ఞ" సహితముగా నన్నెఱుగువారు సమాహిత బుద్ధులై, మరణకాలమునగూడ నన్నెఱిగియే యుందురు.

***"జ్ఞానవిజ్ఞానయోగము" అను పేరుగల
ఏడవ అధ్యాయము సమాప్తము.



# అష్టమాధ్యాయము



## అక్షరబ్రహ్మయోగము

అర్జున ఉవాచ :—

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే ॥ ౧

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ ౨

శ్రీభగవానువాచ:—

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3

---

అరునుడు పలికెను :—

౧. కృష్ణా, ఆ "బ్రహ్మ" మెయ్యది? "అధ్యాత్మ" మనగా ఏమి? "కర్మ" మనగా ఏమి? దేనిని "అధిభూత" మందురు? దేనికి "అధిదైవ" మని పేరు?

౨. ఇచట, ఈ శరీరమున "అధియజ్ఞము" ఎవరు? ఇం దెట్లు నిలిచి యున్నాడు? మఱియు ఆత్మనిగ్రహముగలవారు అవసానకాలమున ని న్నె ట్లెఱుగగలరు?

శ్రీ భగవానుడు పలికెను :—

3. వినాశరహితమైనదే సర్వాధికమగు "బ్రహ్మము". వ్యక్తిశరీరము లలో నిలిచియుండు దానిభావమునే (ప్రత్యగాత్మను) "అధ్యాత్మము"

అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥ ౪
అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥ ౫
యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్ ।
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥ ౬
తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః ॥ ౭
అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్ ॥ ౮

---

అందురు. భూతముల ఉత్పత్తికిని, ఉనికికిని కారణమగు యజ్ఞాహుతి క్రియనే "కర్మము" (సత్కర్మములన్నియు ఇందు చేరును) అందురు.

౪. వినాశశీలములగు శరీరాది ప్రకృతిరూపములే "అధిభూతము"; శరీరాంతర్వర్తియగు పురుషుడే "అధిదైవతము"; అంతర్యామిరూపమున ఈ దేహమున నుండు నేనే "అధియజ్ఞ"మను.

౫. మరణకాలమున నన్నే స్మరించుచు శరీరమును వీడువాడు నా స్వరూపమునే పొందును. ఇది నిస్సంశయము.

౬. మానవుడు తన మరణకాలమున ఏయే భావమును స్మరించుచు దేహమును వీడునో, అతడు సదా స్మరించుచుండిన ఆ భావమునే పొందును.

౭. కావున సర్వకాలములందును నన్ను మదిలో నుంచుకొని యుద్ధముచేయుము. మనోబుద్ధులు నాయందే నిలిచియుండెనేని, నీవు నిస్సంశయముగా నన్ను చేరుదువు.

౮. నిరంతరధ్యానాభ్యాసముచేత సుస్థిరత నంది, ఇతరవిషయముల

కవిం పురాణమనుశాసితార-
మణోరణీయాంసమనుస్మరేద్యః ।
సర్వస్య ధాతారమచిన్త్యరూప-
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ ౯

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥ ౧౦

యదక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ ౧౧

---

దెసకు పోక నిలిచియుండు మనస్సుతో, పరముడును, జ్యోతిఃస్వరూపుడును అగు పురుషుని (అధిదైవతమును) స్మరించువాడు అతనినే పొందును.

౯-౧౦. భక్తిపూరితమును, నిశ్చలమునుఅగు చిత్తముతోను, యోగబలము చేతను, కనుబొమలనడుమ ప్రాణమును సంపూర్ణముగ నిలిపి, సర్వజ్ఞుడును, సనాతనుడును, విశ్వశాసకుడును, సూక్ష్మాతిసూక్ష్మమగు అణువుకన్న సూక్ష్మతరుడును, భావనాతీతస్వరూపుడును, సూర్యునివలె స్వయంప్రకాశవంతుడును, మాయాంధకారమునకు అవలనుండువాడును, అగు ఆ పరమపురుషుని, ఆ తేజస్స్వరూపుని ఎవడు మరణకాలమున ధ్యానించునో, అతడు ఆ పరమపురుషునే చేరును.

౧౧. వేదవిదులు దేనిని అవినాశమందురో, ముక్తసంగులగు యతులు దేనిని పొందుదురో, దేనిని పొందగోరి వారు నిష్ఠురబ్రహ్మచర్య మనుష్ఠింతురో, ఆ బ్రహ్మపదమును సంగ్రహముగా నీకు వివరింతును.

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥ ౧౩
అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥ ౧౪
మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ ౧౫
ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥ ౧౬
సహస్రయుగపర్యన్తమహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః ॥ ౧౭

---

౧౨-౧౩. ఇంద్రియముల నెల్ల నియమించి, మనస్సును హృదయమున నిలిపి, ప్రాణమును శిరస్సునం దుంచి, ఆత్మయోగధారణ మభ్యసించుచు, ఏకాక్షరమగు ఓంకారము (బ్రహ్మము) నుచ్చరించుచు, నన్ను స్మరించుచు, ఈ దేహమును విడనాడి పయనించువాడు పరమగమ్యమును చేరును.

౧౪. అనన్యచిత్తముతో నన్ను అనుదినము, నిరంతరము, స్మరించుచు, యోగమున సదా సుస్థిరుడై యుండు యోగికి నేను సుసాధ్యుడను.

౧౫. పరిపూర్ణత్వ మంది నన్ను చేరిన మహాత్ములు దుఃఖనిలయము, అశాశ్వతము, అగు పునర్జన్మము నొందరు.

౧౬. బ్రహ్మలోకసహితముగా సర్వలోకములు పునర్జన్మముతో కూడినవే. కాని నన్ను పొందినవారికి ఇక పునర్జన్మము ఉండదు.

౧౭. అహోరాత్రములతత్త్వము నెఱిగినవారు బ్రహ్మయొక్క దినము

అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥ ౧౮

భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ॥ ౧౯

పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ ౨౦

అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ ౨౧

పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ ౨౨

---

వేయియుగముల పరిమితిగల దనియు, రాత్రియు అట్టిదే యనియు ఎఱుగుదురు. (ఇవియే జగత్తుయొక్క వికాసము, సంకోచము).

౧౮. బ్రహ్మయొక్క పగలు ప్రారంభించుటతోడనే, "అవ్యక్త" స్థితి నుండి సర్వచరాచరములు వ్యక్తరూపముల నొందును. రాత్రి ప్రారంభించుట తోడనే "అవ్యక్తము"లో అన్నియు లయించును.

౧౯. బ్రహ్మయొక్క పూర్వదినమున ఉండిన భూతసమూహమే మరల మరల ఉద్భవిల్లుచు, రాత్రి వచ్చుటతోడనే (అవశముగా) అవ్యక్తమున లీనమగుచు, పగలు ప్రారంభించుటతోడనే మరల పుట్టుచుండును.

౨౦. కాని ఈ అవ్యక్తముకంటె అతీతమై ఒక సద్వస్తువు — అవ్యక్తము, శాశ్వతము నైనది — కలదు. అది సర్వభూతవిలయవేళయందు లయింపదు.

౨౧. "అవ్యక్తము", "అక్షరము" అనుదానినే "పరమగతి" అనియు అందురు. అది నా పరమధామము (అత్యుత్తమపదము). దానిని పొందిన వారికి పునర్జన్మ ముండదు.

యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥ ౨౩

అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ ౨౪

ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాన్ద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే॥ ౨౫

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తిమన్యయావర్తతే పునః॥ ౨౬

నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥ ౨౭

---

౨౨. సర్వభూతములు ఎవనిలో నెలకొనియున్నవో, ఎవనిచేత ఈ నిఖిలము పరివ్యాప్తమైయున్నదో, ఆ పరమపురుషుడు అనన్యభక్తిచే లభ్యుడగును.

౨౩. ఏ కాలము (మార్గము) లందు శరీరవిమోక్షానంతరము పయనించు యోగులకు పునర్జన్మముండదో, ఎవరికి ఉండునో, నీ కిపుడు తెలిపెదను.

౨౪. అగ్ని, జ్యోతి, పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణపు ఆఱు నెలలు: బ్రహ్మవిదులు ఈ త్రోవను పయనించి బ్రహ్మమును చేరుదురు.

౨౫. ధూమము, రాత్రివేళ, కృష్ణపక్షము, దక్షిణాయనపు ఆఱు నెలలు: ఈ త్రోవను పయనించు యోగి చంద్రజ్యోతిని ప్రాపించి, మరల వచ్చును (పుట్టును).

౨౬. లోకములోని ఈ దేవయాన, పితృయాన మార్గములు రెండును శాశ్వతము లని చెప్పబడుచున్నవి. మొదటిమార్గమున పుట్టకుండుటయు, రెండవదానివలన పుట్టుటయు కలుగును.

వేదేషు యజ్ఞేషు తపఃసు చైవ
 దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
 యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥ ౨౮

ఇతి అక్షరబ్రహ్మయోగో
నామాష్టమోఽధ్యాయః

---

౨౭. ఈ రెండుమార్గముల నెఱిగినపిదప యోగి యెవ్వడును మూఢత నొందడు. కావున అర్జునా, నీవు సర్వదా యోగమునందు సుస్థిరుడవై యుండుము.

౨౮. ఇది యెఱిగిన యోగి వేదాధ్యయనము, యజ్ఞానుష్ఠానము, తపస్సు, దానములు: వీనివలన కలుగు శాస్త్రోక్తపుణ్యముల నన్నిటి నతిక్రమించి, ఆద్యమును, పరమమును అగు స్థానమునకు పోవును.

*** "అక్షరబ్రహ్మయోగము" అను పేరుగల
ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.



# నవమాధ్యాయము



## రాజవిద్యారాజగుహ్యయోగము

శ్రీభగవానువాచ:—

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ ౧

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ ౨

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప ।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥ 3

---

శ్రీ భగవానుడు పలికెను :—

౧. దురాక్షేపములు చేయకయుండు నీకు నే నిప్పుడు అత్యంత గోప్యమగు విజ్ఞానసహితజ్ఞానమును తెలిపెదను. దీని నెఱిగితివేని నీవు (అశుభము) సంసారమునుండి విముక్తుడవగుదువు.

౨. ఇది విద్యలలో శ్రేష్ఠతమము; రహస్యములలో అత్యంతనిగూఢము; శుద్ధికరములలో అత్యుత్తమము; ప్రత్యక్షానుభవరూపముననే కాంచదగినది; ధర్మసంగతము; అనుష్ఠానసులభము; తఱుగని ఫలము నిచ్చునది.

3. ఈ ధర్మమందు శ్రద్ధలేనివారు నన్ను పొందక, మృత్యుసంయుతమగు పునర్జన్మమార్గమునకు మరల వత్తురు.

మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥ ౪

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః॥ ౫

యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ॥ ౬

సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥ ౭

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్॥ ౮

---

౪. ఇంద్రియగోచరముకాని నా రూపముతో ఈ లోకము పరివ్యాప్తమైయున్నది. సర్వభూతములు నాయందున్నవి. నేను వానియందుండను.

౫. మఱియు (వాస్తవముగా) భూతములు నాయందుండవు. నా దైవయోగమును చూడుము. వానికి మూలమై, పోషకమై, యుండియు నా ఆత్మ వానియందు వసింపదు.

౬. మహాబలసంపన్నమగు వాయువు ఎల్లప్పుడు సర్వత్ర సంచరించుచునే ఎట్లు ఎల్లెడ ఆకాశమందే (దానినంటక) నిలిచియుండునో, అట్లే సర్వభూతములు నాయందు నిలిచియుండునని ఎఱుగుము.

౭. కల్పాంతమున సర్వభూతములు నా (అపరా) ప్రకృతిలోనికి మరలపోవును; మఱొకకల్పాదియందు వానిని మరల నేను సృజింతును.

౮. నా (అపరా) ప్రకృతిని (కల్పాదిని) పునఃప్రాణవంత మొనర్చి, ప్రకృతి అధీనమున అవశమైయున్న ఈ భూతసమూహ మంతటిని నేను మరల మరల సృజించుచుందును.

న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ।
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు॥ ౯

మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్।
హేతునాఽనేన కౌన్తేయ జగద్విపరివర్తతే॥ ౧౦

అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్॥ ౧౧

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥ ౧౨

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః।
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్॥ ౧౩

---

౯. జోలిలేనివానివలె, అసక్తునివలె, నుండు నన్ను ఈ కర్మములు బంధింపవు.

౧౦. నా సాన్నిధ్యముచేత ప్రకృతి ఈ చరాచరలోకము నంతయు సృజించుచున్నది. ఇందుచేతనే జగత్తు తిరుగుచున్నది.

౧౧. సర్వభూతమహేశ్వరుడ నగు నా పరమతత్త్వము నెఱుగక, మనుష్యరూపధారినగు నన్ను మూఢులు అలక్ష్యబుద్ధితో చూతురు.

౧౨. వ్యర్థకాంక్షలు గలిగి, వ్యర్థకర్మము లొనర్చుచు, వ్యర్థజ్ఞాన మార్జించుకొనుచు, వారు బుద్ధిహీనులై రాక్షస (రాజసిక) ప్రకృతియు, అసుర (తామసిక) ప్రకృతియు కలిగియుందురు.

౧౩. కాని సాత్త్విక(దైవీ)ప్రకృతిగల మహాత్ములు నన్ను సర్వభూతములకు మూలముగను, మార్పు లెఱుగనివానిగను, ఎఱిగి ఏకాగ్రచిత్తముతో భజింతురు.

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ ౧౪

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ ౧౫

అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్ ।
మన్త్రోఽహమహమేవాజ్యమహమగ్నిరహం హుతమ్ ॥ ౧౬

పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్రమోఙ్కార ఋక్ సామ యజురేవ చ ॥ ౧౭

గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్ ।
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥ ౧౮

---

౧౪. సర్వదా నన్ను కీర్తించుచు, దృఢవ్రతులై యత్నించుచు, నాకు భక్తిపూరితనమస్కారము లాచరించుచు, ఎల్లప్పుడు సమాహితచిత్తులై యుండువారు నన్ను ఉపాసింతురు.

౧౫. ఇతరులును జ్ఞానయజ్ఞరూపమగు (=సర్వభూతములను ఆత్మగనే చూచుచు) ఆహుతు లర్పించుచు, విశ్వరూపుడనగు నన్ను, ఏకీభావముతోను (తానే అతడను భావము), భిన్నరూపునిగను, అనేక (దేవతా) రూపునిగను, ఉపాసింతురు.

౧౬. క్రతువను నేను; యజ్ఞమను నేను; స్వధను నేను; ఔషధమను (ఓషధి) నేను; మంత్రమను నేను; ఆజ్యమను నేను; అగ్నిని నేను; హుతమను నేను.

౧౭. ఈ జగత్తునకు పిత, మాత, ఫలప్రదాతయై పోషించుధాత, పితామహుడు పవిత్రీకరించువాడు, తెలిసికొనవలసిన ఏకైకవస్తువు, ఓంకారము, ఋగ్యజుస్సామములు : ఇవన్నియు నేనే.

౧౮. పరమగమ్యము, పోషకుడు, ప్రభుడు, సాక్షి, నివాసము,

తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥ ౧౯

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోక-
మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్ ॥ ౨౦

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే ॥ ౨౧

---

శరణము, సఖుడు, సృష్టికర్త; సంహారకుడు, అధిష్ఠానము, ధనాగారము, అక్షయబీజము, నేనే.

౧౯. నేను (సూర్యుడనుగా) వేడిమినిత్తును; వర్షమును నిరోధింతును, కురియింతును; అమృతత్వము, మృత్యువు కూడ నేనే; సత్తు (గోచరించు జగత్తు) అసత్తు (దాని అగోచరకారణము) కూడ నేనే.

౨౦. త్రివేదజ్ఞులు యజ్ఞరూపమున నన్ను పూజించి, సోమపానముచే పాపవిముక్తులై, స్వర్గముకై ప్రార్థింతురు; దేవేంద్రుని పుణ్యలోకము చేరి, అచట దేవత లనుభవించు దివ్యభోగములు భోగింతురు.

౨౧. వారు విశాలమగు ఆ స్వర్గలోకమును భోగించి, పుణ్యము ముగిసినపిదప మర్త్యలోకమును ప్రవేశింతురు. ఇట్లు వేదత్రయ (కర్మకాండ) మున నిర్దేశింపబడిన ధర్మము లనుష్ఠించుచు, భోగాసక్తులై వారు జనన మరణము లొందుచుందురు.

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ ౨౨
యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః।
తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్॥ ౨౩
అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే॥ ౨౪
యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్యాన్తి పితృవ్రతాః।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్॥
పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥ ౨౬

---

౨౨. సంపూర్ణనిష్ఠతో, నేను తామేయైనట్లు భావించుచు, సర్వము నందు నన్నుపాసించుచు, ఉండువారి యోగక్షేమ (౨ అ. ౪౫ శ్లో. చూ.) భారమును నేను వహింతును.

౨౩. శ్రద్ధాయుక్తబుద్ధితో ఇతరదేవతల నర్చించు భక్తులుకూడ నన్నే అర్చించుచున్నారు. కాని వారిది తప్పుత్రోవ.

౨౪. ఏలన సర్వయజ్ఞముల ననుభవించువాడను, ప్రభుడను నేనే గదా. కాని వారు నన్ను యథార్థముగా ఎఱుగరుగనుక (యజ్ఞఫలముగా లభించు లోకములనుండి భ్రంశమునొంది) మరల పుట్టుచుందురు.

౨౫. దేవోపాసకులు దేవతలను పొందుదురు. పిత్రుపాసకులు పితరులను పొందుదురు. భూతోపాసకులు భూతములను పొందుదురు. నన్నుపాసించువారు అక్షయుడగు నన్ను పొందుదురు.

౨౬. పరిశుద్ధచిత్తులు భక్తిపూర్వకముగా నొక పత్త్రమునో, ఫలమునో, జలమునో నాకు సమర్పించినయెడ—భక్తితో సమర్పింపబడు ఆ కానికను — నేను గ్రహింతును.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ ౨౭

శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సంన్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ ౨౮

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥ ౨౯

అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ ౩౦

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ ౩౧

---

౨౭. నీవు చేయు కర్మములను, భుజించు వస్తువులను, వేల్చు హవిస్సులను, ఇచ్చు దానములను, అభ్యసించు తపములను, నాకు సమర్పించుచున్నట్లు భావింపుము.

౨౮. శుభాశుభఫలముల నిచ్చు కర్మముల బంధనమునుండి నీ వట్లు విముక్తుడవౌదువు. సన్న్యాసయోగమున (సర్వము ఈశ్వరున కర్పించుట) సునిశ్చితమైన చిత్తము కలిగి, (జీవించియుండగనే) ముక్తుడవై, నీవు మరణానంతరము నాకడకు వత్తువు.

౨౯. నేను సర్వభూతములకు సముడను: ద్వేష్యులు, ప్రియులు నా కెవ్వరు లేరు. కాని నన్ను భక్తితో భజించువారు నాయందుందురు. నేనును వారియందుందును.

౩౦. ఘోరపాపిష్ఠుడైనను నాయందే సునిశ్చితమగు భక్తితో నన్ను భజించెనేని — చక్కనినిశ్చయ మొనర్చుకొనెను గనుక — అతనిని సాధువుగనే గణింపవలెను.

౩౧. అతడు శీఘ్రముగనే ధర్మచిత్తుడై, శాశ్వతశాంతి నందును.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥
కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా ।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్ ॥ 33
మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః ॥ 3౪

ఇతి రాజవిద్యారాజగుహ్యయోగో నామ
నవమోఽధ్యాయః

---

నా భక్తు డెన్నడును నాశమొందడు. నీ విట్లు సునిశ్చితముగా ఇతరులకు తెలుపుము.

3౨. పాపజన్ములగు స్త్రీలు, వైశ్యులు, శూద్రులు కూడ నా శరణు చొచ్చి మోక్షమును పొందుదురు.

33. ఇక పుణ్యజన్ములగు బ్రాహ్మణులనుగూర్చి, భక్తిపూర్ణులగు రాజర్షులనుగూర్చి, చెప్పవలెనా ? అనిత్యము, అసుఖము అగు ఈ లోకమున జన్మించితివిగనుక నీవు నన్ను భజింపుము.

3౪. నీ మనస్సును నాతో నింపుకొని, నా భక్తుడవై, నన్నుగూర్చి యజ్ఞములుచేయుచు, నాకు నమస్కరించుచు ఉండుము. నీ చిత్తము ఇట్లు నాయందు సుస్థిరముగా నిలుపుకొని నన్ను పరమగమ్యముగా చేసికొంటివేని, నీవు నాకడకు వత్తువు.

***"రాజవిద్యారాజగుహ్యయోగము" అను పేరుగల
తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.



# దశమాధ్యాయము



## విభూతియోగము

శ్రీభగవానువాచ:—

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా॥

న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః॥ ౨

యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్।
అసంమూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥ 3

బుద్ధిర్జ్ఞానమసంమోహః క్షమా సత్యం దమః శమః।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ॥

---

శ్రీభగవానుడు పలికెను:—

౧. నావాక్యములను వినుటందు సంప్రీతుడవగు నీ హితమునుగోరి నేను మరల నా పరమ (తత్త్వ) వాక్యమును చెప్పెదను. అర్జునా, వినుము.

౨. దేవగణములుగాని, మహర్షులుగాని, నా పుట్టుక నెఱుగరు. ఏలన, వారి కెల్లరకు నేనే సర్వవిధములను ఆధికారణమను.

3. పుట్టుకలేనివాడ నని, అనాది నని, సర్వలోకేశ్వరుడ నని, నన్నెఱుగువాడు మనుష్యులలో మూఢతారహితుడు, సర్వపాపవిముక్తుడు.

౪-౫. జీవులకు ఈ వివిధభావములు — బుద్ధి, జ్ఞానము, అసమ్మూఢత, సహనము, సత్యము, బాహ్యేంద్రియనిగ్రహము, శాంతచిత్తత, సుఖము,

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః ।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ ౫
మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥ ౬
ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ ౭
అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ॥ ౮
మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ । ౯

---

దుఃఖము, ఉత్పత్తి, విలయము, భయము, నిర్భయత, అహింస, సమచిత్తత, తృప్తి, తపస్సు, దానము, కీర్తి, అకీర్తి — నాయొద్దనుండియే ఉత్పత్తి యగును.

౬. సప్తమహర్షులు, ప్రాచీనకాలమనువులు నలుగురు — (నాయందే తలపులు నిలుపుటచే) నాతోసమప్రభావులు — నా మానసపుత్రులు. లోకముననుండు ఈ జీవులందఱును వారి సంతతి.

౭. వివిధములగు నా యీ వివిధ గోచరరూపములను, (ఈ) యోగశక్తిని, యథార్థరీతిగా ఎఱుగువాడు సమాధి (ఆత్మ) యందు సప్రతిష్ఠితుడగును. ఇది నిస్సంశయము.

౮. నేను సర్వమునకు ఉత్పత్తిస్థానమను. నాలోనుండియే సర్వము ఉద్భవిల్లుచున్నది; ఇదితలచుచు జ్ఞానులు నన్ను ప్రేమపూరితచిత్తులై భజింతురు.

౯. చిత్తము నాయందే నిలిపి, ఇంద్రియములు నాలో లీనమొనర్చి, ఒకరికొకరు బోధించుకొనుచు, నన్నుగూర్చియే సదా మాటలాడుకొనుచు, వారు సంతుష్టులై, ఆనందభరితులై, యుందురు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥ ౧౦

తేషామేవానుకమ్పార్థమహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ ౧౧

అర్జున ఉవాచ :—

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్ ॥ ౧౨

ఆహుస్త్వామృషయః సర్వే దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥ ౧౩

సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ ౧౪

---

౧౦. ఎల్లప్పుడు సమాహితులై, ప్రీతితోనన్ను సేవించువారికినేను "బుద్ధియోగము" (అ.౨, శ్లో.౪౯,౫౦) నిత్తును. తన్మూలమునవారు నాకడకు వత్తురు.

౧౧. వారియందు కేవలదయచేతనే, నేను వారిబుద్ధియందు నెలకొని, వారిలోని అజ్ఞానాంధకారమును సమ్యగ్దర్శన (పరిపూర్ణసత్య) దీప్తినిచ్చు వివేకదీపమువలన నాశిల్లజేయుదును.

అర్జునుడు పలికెను :—

౧౨-౧౩. పరబ్రహ్మమవు, పరమపదమవు, పరమపావనుడవు నీవే. ఋషు లెల్లరు — దేవర్షినారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు — శాశ్వతుడ వని, దివ్యపురుషుడ వని, ఆదిదేవుడ వని, జన్మరహితుడ వని, సర్వవ్యాపి వని నిన్ను వర్ణించుచున్నారు. నీవు స్వయముగాకూడ నా కట్లే చెప్పుచున్నావు.

౧౪. నీవు నాకు చెప్పినసర్వము సత్యమని తలతును. ఓ భగవానుడా, దేవతలుగాని, దానవులుగాని, నీ వ్యక్తభావము నెఱుగరు.

స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ ౧౫

వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ ౧౬

కథం విద్యామహం యోగిస్త్వాం సదా పరిచిన్తయన్ ।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా ॥ ౧౭

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥

శ్రీ భగవానువాచ :—

హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే ॥ ౧౯

---

౧౫. పురుషోత్తమా, భూతోత్పత్తికారకా, జీవేశ్వరా, దేవదేవా, జగత్పతీ, నీయంతటనీవే — ఆత్మవలన — నిన్ను తెలిసికొనుచున్నావు.

౧౬. అలౌకికములగు ఏ వ్యక్తభావములవలన ఈ లోకములను నిండి నీవు నిలిచియున్నావో, ఆ దివ్యభావములను సంపూర్ణముగ నీవే చెప్పవలెను.

౧౭. ఓ యోగీ, నిన్నెఱుగుటకు నేను సదా ఎట్లు ధ్యానింపవలెను ? భగవానుడా, ఏయేవస్తువులందు నిన్ను నేను చింతింపదగును ?

౧౮. నీ యోగశక్తులనుగూర్చి, నీ వ్యక్తభావములనుగూర్చి, మరల సవిస్తరముగా చెప్పుము. నీ వాక్యామృతమును వినుటందు నాకు తనివి తీరుటలేదు.

శ్రీభగవానుడు పలికెను :—

౧౯. నా దివ్యవిభూతులనుగూర్చి — వాని ప్రాధాన్యము ననుసరించి — నీ కిపుడు తెలిపెదను. అవి అనంతములుగనుక సవిస్తరముగా తెలుపనశక్యము.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥ ౨౦

ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥ ౨౧

వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ ౨౨

రుద్రాణాం శఙ్కరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ ॥ ౨౩

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।
సేనానీనామహం స్కన్దః సరసామస్మి సాగరః ॥ ౨౪

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥ ౨౫

---

౨౦. నేను సర్వభూతహృదయములందు నిలిచియుండు ప్రత్యగాత్మను. సర్వభూతముల పుట్టుక, ఉనికి, అంతము కూడ నేనే.

౨౧. ఆదిత్యులలో నేను విష్ణు డనువాడను. జ్యోతులలో రశ్మియుక్తు డగు సూర్యుడను, మరుత్తులలో మరీచిని, నక్షత్రములలో చంద్రుడను.

౨౨. నేను వేదములలో సామవేదమను, దేవతలలో ఇంద్రుడను, ఇంద్రియములలో మనస్సును, ప్రాణులలో చేతన (తెలివి) మను.

౨౩. రుద్రులలో శంకరుడను, యక్షరాక్షసులలో ధనాధిపుడగు కుబేరుడను, వసువులలో పావకుడను, పర్వతములలో మేరుగిరిని.

౨౪. పురోహితులలో ముఖ్యుడగు బృహస్పతిగా నన్నెఱుగుము; సేనానులలో నేను కుమారస్వామిని; నీటిపట్టులలో సముద్రుడను.

౨౫. మహర్షులలో భృగుడను, మాటలలో ఏకాక్షరమగు ఓంకార

అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః।
గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః॥ ౨౬

ఉచ్చైఃశ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్॥ ౨౭

ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్।
ప్రజనశ్చాస్మి కన్దర్పః సర్పాణామస్మి వాసుకిః॥ ౨౮

అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్।
పితౄణామర్యమా చాస్మి యమః సంయమతామహమ్॥ ౨౯

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।
మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్॥ ౩౦

---

మను, యజ్ఞములలో మానసికజపమను, స్థావరపదార్థములలో హిమాద్రిని.

౨౬. చెట్లన్నిటిలో నేను రావిచెట్టును, దేవర్షులలో నారదుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిలమునిని.

౨౭. గుఱ్ఱములలో అమృతముతోపుట్టిన ఉచ్చైఃశ్రవముగా, గజేంద్రములలో ఐరావతముగా, నరులలో నృపాలుడుగా నన్నెఱుగుము.

౨౮. ఆయుధములలో నేను వజ్రాయుధమను; గోవులలో కామధేనువను; సంతానకారకుడగు మన్మథుడనుకూడ నేనే. సర్పములలో (ఇవి విషయుక్తములు) నేను వాసుకిని.

౨౯. నాగులలో (ఇవి నిర్విషములు) అనంతుడను, జలదేవతలలో వరుణుడను, పితృదేవతలలో అర్యముడను, శాసకులలో యముడను.

౩౦. దైత్యులలో ప్రహ్లాదుడను, లెక్కించువారిలో కాలమను, మృగములలో మృగేంద్రమగు సింహమను, పక్షులలో గరుడుడను.

పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥ ౩౧

సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున ।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥ ౩౨

అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ ।
అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥ ౩౩

మృత్యుః సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ ౩౪

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసామహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహమృతూనాం కుసుమాకరః ॥ ౩౫

---

౩౧. పవిత్రమొనర్చువానిలో నేను గాలిని, ఆయుధధారులలో రాముడను, మత్స్యములలో మొసలిని, నదులలో గంగానదిని.

౩౨. గోచరవస్తువులకు ఆదిమధ్యాంతములు నేనే; విద్యలలో ఆత్మవిద్యను, తార్కికులలో "వాద" (సత్య మెఱుగుటకు చేయు చర్చ) మను.

౩౩. అక్షరములలో నేను అకారమను; సమాసములలో ద్వంద్వమను; అనంతమగు కాలముకూడ నేనే (౩౦-వ శ్లో॥ లోని కాలము అంతముగలది), సర్వతోముఖకర్మఫలప్రదాత యగు ధాతనుకూడ నేనే.

౩౪. సర్వసంహారకమగు మృత్యువుకూడ నేనే. అభ్యుదయము నొందనున్నవారి అభ్యుదయమను నేను. స్త్రీగుణములలో నేను కీర్తిని, సిరిని, వాక్కును, జ్ఞప్తిని, తెలివిని, స్థైర్యమును, ఓరిమిని.

౩౫. సామగీతములలో నేను బృహత్సామమను, ఛందస్సులలో గాయత్రిని, మాసములలో మార్గశిరమను, ఋతువులలో వసంతమను.

ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥ ౩౬

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనఞ్జయః ।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥ ౩౭

దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥ ౩౮

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్ ॥ ౩౯

నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప ।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ ౪౦

---

౩౬. వంచకుల (మోసగాండ్ర) జూదమును నేను; తేజశ్శాలుర ప్రభావమును నేను; (జయశీలుర) జయమును నేను; (ఉద్యమపరుల) ఉద్యమమును నేను; సాత్త్వికుల సత్త్వగుణమును నేను.

౩౭. వృష్ణివంశీయులలో నేను వాసుదేవుడను, పాండవులలో అర్జునుడను, మునులలో వ్యాసుడను, సూక్ష్మార్థవివేకులలో శుక్రుడను.

౩౮. శిక్షకులకు నేను రాజదండమును, జయింపగోరువారికి నీతిని, గోపనీయవస్తువులలో నేను మౌనమును, జ్ఞానుల జ్ఞానమును నేను.

౩౯. సర్వభూతములకు (బీజము) మూలకారణ మెద్దియో, అదియు నేనే. నేను లేనిచో, స్థావరజంగమభూతములలో ఏదియు ఉండజాలదు.

౪౦. నా దివ్యవిభూతులు అనంతములు. కాని వాని వివరణము నే నిప్పుడు సంక్షేపముగ చెప్పితిని.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసమ్భవమ్॥ ౪౧

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్॥ ౪౨

ఇతి విభూతియోగో నామ
దశమోఽధ్యాయః

---

౪౧. మహితము, సంపద్యుక్తము, శక్తిసమేతము అగు వస్తు వేది యున్నను, అది నా తేజస్సులోని ఒక అంశమువలననే కలిగినదని ఎఱుగుము.

౪౨. కాని ఈ వైవిధ్యము నంతయు నెఱుగుట నీ కెట్లుపకరించును? ఈ సర్వజగత్తును నాలోనొక్క భాగముచేతమాత్రమే నేను నిండి, ధరించి యున్నాననిమాత్రము ఎఱుగుము.

***"విభూతియోగము" అను పేరుగల
పదవ అధ్యాయము సమాప్తము.



# ఏ కా ద శా ధ్యా య ము



## విశ్వరూపదర్శనం

అర్జున ఉవాచ:—

మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥ ౨

ఏవమేతద్యథాత్థ త్వమాత్మానం పరమేశ్వర ।
ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ ॥ 3

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్ ॥

---

అర్జునుడు పలికెను:—

౧. నన్ను అనుగ్రహించి నీవు పల్కిన ఆత్మానాత్మవివేకవిషయక మగు పరమరహస్యరూపబోధవలన నా యీ మూఢత తొలగిపోయినది.

౨. కృష్ణా, భూతముల ఉత్పత్తివిలయములనుగూర్చియు, అక్షయ మగు నీ మాహాత్మ్యమునుగూర్చియు నీవలన సవిస్తరముగా వింటిని.

3. పరమేశ్వరా, నీవు ఎట్టివాడ వని చెప్పితివో, అట్టివాడవే. కాని నీ ఈశ్వరరూపమును చూడగోరుచున్నాను.

శ్రీభగవానువాచ:—

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥ ౫

పశ్యాదిత్యాన్వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత॥ ౬

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి॥ ౭

న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్॥ ౮

---

౪. ప్రభూ, యోగేశ్వరా, దానిని నేను చూడనోపుదునని నీకు తోచినచో, నిత్యమగు నీ జగదాత్మస్వరూపమును చూపుము.

శ్రీభగవానుడు పలికెను:—

౫. అర్జునా, నూర్లకొలదులును; వేలకొలదులును; వివిధవర్ణములు, వివిధాకృతులు గలవియును; అగు నా వివిధదివ్యరూపములను చూడుము.

౬. ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినులను, మరుత్తులను, చూడుము. మఱియు, ఇంతవఱకుచూడని ఆశ్చర్యములు పెక్కింటిని చూడుము.

౭. ఈ నా శరీరమున కేంద్రీకృతమైయున్న స్థావరజంగమాత్మకమగు అఖిలజగత్తును, నీవు చూడగోరు ఇతరము నంతయు ఇపుడు చూడుము.

౮. కాని యీ నీ మాంసచక్షువులతోనే నన్ను (నా విశ్వరూపమును) చూడజాలవు; నీకు అలౌకికమగు జ్ఞాననేత్రము నిచ్చుచున్నాను. ఐశ్వరమగు నా యోగశక్తిని చూడుము.

సఞ్జయ ఉవాచ :—

ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ ॥ ౯

అనేకవక్త్రనయనమనేకాద్భుతదర్శనమ్ ।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ ౧౦

దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖమ్ ॥ ౧౧

దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।
యది భాః సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః ॥ ౧౨

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవస్తదా ॥ ౧౩

---

సంజయుడు పలికెను :—

౯. రాజా, యిట్లు చెప్పి, మహాయోగేశ్వరుడగు హరి తన పరమమగు ఈశ్వరరూపమును అర్జునునకు చూపెను.

౧౦. పెక్కునోళ్లతోను కన్నులతోను, పెక్కు అద్భుతదృశ్యములతోను, పెక్కు దివ్యాభరణములతోను, ఎత్తబడియున్న పెక్కు దివ్యాయుధములతోను,

౧౧. దివ్యమాల్యములను, దివ్యవస్త్రములను దాల్చి, దివ్యపరిమళముగల మైపూతలతో, సర్వాశ్చర్యమయమై, తేజస్వంతమై, అనంతమై, సర్వరూపాత్మకమై,

౧౨. వేగురు సూర్యుల కాంతి ఆకసమున నొకేతడవ సముద్భవించినచో అది ఆ మహాత్మునికాంతిని పోలియుండును.

౧౩. అచట, ఆ దేవదేవునిదేహమందు, నానాభేదమయజగత్తంతయు ఒకనియందే నిలిచియుండుటను, అర్జునుడు చూచెను.

తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలిరభాషత॥ ౧౪

అర్జున ఉవాచ :—

పశ్యామి దేవాంస్తవ దేవ దేహే
సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్।
బ్రహ్మాణమీశం కమలాసనస్థ-
మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥ ౧౫

అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప॥ ౧౬

---

౧౪. అంతట అచ్చెరువు నిండార, పులకితాంగుడై, శిరస్సువంచి ప్రణమిల్లి, మోడ్పుచేతులతో, (విశ్వరూపియగు) దేవునితో అర్జును డిట్లనెను.

అర్జునుడు పలికెను :—

౧౫. దేవా, నీ దేహమందు సర్వదేవతలను, వివిధములగు చరాచర భూతసమూహములనన్నిటిని, కమలాసనస్థుడగు బ్రహ్మను, ఋషులను, దివ్య సర్పములనన్నిటిని నేను చూచుచున్నాను.

౧౬. జగదీశ్వరా, విశ్వరూపా, పెక్కుభుజములు, పెక్కుఉదరములు (కడుపులు), పెక్కుముఖములు, పెక్కునేత్రములు గల నీ అనంత రూపమును సర్వత్ర చూచుచున్నాను. నీ ఆదిమధ్యాంతము లేవియు నాకు కనిపించుట లేదు.

కిరీటినం గదినం చక్రిణం చ
  తేజోరాశిం సర్వతోదీప్తిమన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తాద్
  దీప్తానలార్క-ద్యుతిమప్రమేయమ్ ॥ ౧౭

త్వమక్షరం పరమం వేదితవ్యం
  త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా
  సనాతనస్త్వం పురుషో మతో మే ॥ ౧౮

అనాదిమధ్యాన్తమనన్తవీర్య-
  మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్ ।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
  స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥ ౧౯

ద్యావాపృథివ్యోరిదమన్తరం హి
  వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।

---

౧౭. గదాచక్రకిరీటధారివై, తేజోరాశివలె సర్వత్ర ప్రకాశించుచు, దుర్నిరీక్ష్యుడవై, ప్రజ్వలాగ్నివలె, సూర్యునివలె అన్నిదిశలందును దీప్తిమంతుడవై, అపరిమితుడవై, యుండు నిన్ను చూచుచున్నాను.

౧౮. నీవు అవినాశివి; పరాత్పరుడవు; ఏకైకజ్ఞేయపదార్థమవు; ఈ జగత్తునకు పరమశరణ్యుడవు; సనాతనధర్మమునకు అక్షయరక్షకుడవు; పురాణపురుషుడవు; అని నా యభిప్రాయము.

౧౯. ఆదిమధ్యాంతరహితునిగా, అనంతశక్తిమంతునిగా, అనేకబాహునిగా నిన్ను చూచుచున్నాను; సూర్యచంద్రులు నీకన్నులు, ప్రజ్వలించుచుండు అగ్ని నీ నోరు; నీ తేజస్సుచే ఈ జగత్తునంతయు తపింపజేయుచున్నావు.

దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ ౨౦

అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి
కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి।
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసఙ్ఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ ౨౧

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ ౨౨

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదమ్।

---

౨౦. మహాత్మా, ఈ భూమ్యాకాశమధ్యప్రదేశ మంతయు, సర్వదిక్కులును నీతోనే నిండియున్నవి. ఆశ్చర్యకరమగు నీ యీ ఉగ్రరూపమునుచూచి, ముల్లోకములు భయముతో కంపించుచున్నవి.

౨౧. ఈ దేవతాసంఘములు నీలో ప్రవేశించుచున్నారు; కొందఱు భీతితో అంజలిబద్ధులై నిన్ను స్తుతించుచున్నారు. మహర్షిగణములు, సిద్ధగణములు, స్వస్తివాచకములాడుచు, శ్రేష్ఠములగు స్తోత్రములతో నిన్ను కీర్తించుచున్నారు.

౨౨. రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వదేవతలు, అశ్వినీకుమారద్వయము, మరుత్తులు, పితరులు, సిద్ధాసురయక్షగంధర్వగణములు — ఎల్లరును ఆశ్చర్యచకితులై నిన్ను చూచుచున్నారు.

బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాహమ్॥ ౨౩

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో॥ ౨౪

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస॥ ౨౫

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసఙ్ఘైః।

---

౨౩. మహాబాహూ, అసంఖ్యాకములగు నోళ్లు, కన్నులు, బాహువులు, తొడలు, పాదములు, ఉదరములు కలిగి, పెక్కు కోఱలవలన భయంకరమైన నీ మహత్తరరూపమునుచూచి లోకములు భీతిల్లుచున్నవి. నేనును అట్లే భీతిల్లుచున్నాను.

౨౪. విష్ణూ, ఆకసమునంటి, అనేకవర్ణములతో ప్రకాశించుచు, పూర్ణముగా తెఱచుకొనియుండు నోళ్లతో, దీపించు విశాలనేత్రములతో, ఒప్పారు నిన్ను చూచి, నేను భీతచిత్తుడనై, శాంతిధైర్యములు దక్కియున్నాను.

౨౫. ప్రళయాగ్నిసన్నిభములై దీపించు కోఱలవలన భయంకరములగు నీ నోళ్లను చూచి నేను దిగ్భ్రమనొందుచున్నాను; శాంతిపొందజాలకున్నాను. దేవదేవా, జగదాశ్రయా, కృపచూపుము.

౨౬-౨౭. ఈ ధృతరాష్ట్రపుత్రు లందఱును, భూపాలసంఘములతో, భీష్మద్రోణకర్ణులతో, మా యుద్ధవీరప్రముఖులతోసహా — భయంకరములగు

భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥ ౨౬

వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయానకాని ।
కేచిద్విలగ్నా దశనాన్తరేషు
సన్దృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః ॥ ౨౭

యథా నదీనాం బహవోఽమ్బువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవన్తి ।
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి ॥ ౨౮

యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశన్తి లోకా-
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ ౨౯

---

కోఱలుగలిగి, భీషణములగు నీ నోళ్లలోనికి — ఉఱుకుచున్నారు. కొందఱు పండ్లసందులలో ఇఱుకుకొని, చూర్ణీకృతశిరస్సులతో కాన్పించుచున్నారు.

౨౮. అనేక నదీప్రవాహములు సముద్రాభిముఖములై పాఱునట్లే, ఈ నరలోకవీరులు ఘోరముగాప్రజ్వలించు నీ నోళ్లలో ప్రవేశించుచున్నారు.

౨౯. ప్రజ్వలాగ్నియందు మిడుతలు వేగవేగముగా — తమనాశము కొఱకే — ప్రవేశించునట్లు ఈ జనులుకూడ వేగవేగముగా — తమనాశము కొఱకే — నీ నోళ్లలోనికి ఉఱుకుచున్నారు.

లేలిహ్యసే గ్రసమానః సమన్తా-
ల్లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో॥ ౩౦

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద।
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥ ౩౧

శ్రీభగవానువాచ:—

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ ౩౨

---

౩౦. విష్ణూ, మంటలుగ్రక్కుచుండు నీ నోళ్లతో సర్వదిశలనుండు లోకములనెల్ల మ్రింగివైచుచు, నీ పెదవులను నాకుకొనుచున్నావు. నీ భయంకర దీప్తులు తమ తేజస్సుతో ఈ జగత్తునంతయు నింపి తపింపజేయు చున్నవి.

౩౧. ఉగ్రరూపుడవగు నీ వెవరవో నాకు తెలుపుము. దేవశ్రేష్ఠా, నీకు నమస్కారము, అనుగ్రహింపుము. ఆదిపురుషా, ని న్నెఱుగగోరెదను. నీ ఉద్దేశము నేను తెలియజాలకున్నాను.

శ్రీ భగవానుడు పలికెను:—

౩౨. లోకమును సంహరించుటకై ఇచట అభివ్యక్తమైన లోక సంహారమహత్త్వముగల కాలమను నేను. నీవు లేకున్నను, శత్రుసేనలలో వ్యవసితులగు యోధు లెవ్వరును బ్రదికియుండరు.

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ ౩౩

ద్రోణఞ్చ భీష్మఞ్చ జయద్రథఞ్చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్ ।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ ౩౪

సఞ్జయ ఉవాచ :—

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ ౩౫

---

౩౩. కావున నీవు లేచి, యశస్సు నార్జించుకొనుము. శత్రువులను జయించి, నిష్కంటకమగు రాజ్యమును భోగింపుము. ఇప్పటికే వారు నాచేత చంపబడిరి. అర్జునా, నీవు కారణమాత్రుడవుగా నుండుము.

౩౪. ద్రోణుడు, భీష్ముడు, జయద్రథుడు, కర్ణుడు, ఇతర యోధ వీరులు — నాచేత ఇప్పటికే చంపబడిన — వీరిని నీవు చంపుము. భయాకులుడవు కాకుము; యుద్ధముచేయుము. నీ శత్రువులను యుద్ధమున జయింతువు.

సంజయుడు పలికెను :—

౩౫. కృష్ణు డాడిన ఈ మాటలువిని అర్జునుడు చేతులుమోడ్చి, వణకుచు నమస్కరించి, భయాక్రాంతుడై చాగిలి మ్రొక్కి, మరల కృష్ణునితో ఇట్లనెను.

అర్జున ఉవాచ :—

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః ॥ ౩౬

కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।
అనన్త దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥ ౩౭

త్వమాదిదేవః పురుషః పురాణ-
స్త్వమస్యవిశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనన్తరూప ॥ ౩౮

---

అర్జునుడు పలికెను :—

౩౬. కృష్ణా, జగత్తు ఆనందించి నీ స్తుతివలన ప్రీతినొందుటయు; రక్కసులు వెఱపుతో సర్వదిక్కులను పాఱిపోవుటయు; సిద్ధసంఘము లన్నియు నీకు నమస్కరించుచుండుటయు, సముచితమే.

౩౭. బ్రహ్మకంటెనుఅధికుడవై, అతనికిని మూలకారణమవగు మహాత్మా, అనంతమూర్తీ, దేవదేవా, జగదాశ్రయా, నీకు వారేల మ్రొక్కకుందురు? నీవు అవినాశివి, (సదసత్తులు) వ్యక్తావ్యక్తములు నీవే, ఆ రెంటికిని అతీతుడవును నీవే.

౩౮. నీవు ఆదిదేవుడవు; పురాణపురుషుడవు; ఈ జగత్తునకు పరమ శరణ్యమవు; జ్ఞాతవును, ఏకైకజ్ఞేయవస్తువవును నీవే; పరమపదమవును నీవే; అనంతరూపా, ఈ జగత్తు నీచే పరివ్యాప్తమైయున్నది.

వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాఙ్కః
 ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
 పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ ౩౯

నమః పురస్తాదథ పృష్ఠతస్తే
 నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।
అనన్తవీర్యామితవిక్రమస్త్వం
 సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ ౪౦

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
 హే కృష్ణ హే యాదవ హే సఖేతి ।
అజానతా మహిమానం తవేదం
 మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ॥ ౪౧

---

౩౯. వాయుదేవుడవు, యముడవు, అగ్నిదేవుడవు, వరుణుడవు, చంద్రుడవు, ప్రజాపతివి, పితామహుని తండ్రివి, నీవే. నీకు నమస్సులు, వేయిసార్లునమస్సులు, మరలను, ఇంకమరలను నమస్సులు, నమస్సులు!

౪౦. ముందటినుండియు, వెనుకనుండియు, ప్రతిదిక్కునుండియు, నీకు మ్రొక్కెదను. సర్వాత్మా, అనంతశక్తీ, అమేయవిక్రమా, నీవు ఎల్లెడల వ్యాపించియున్నావు. కావున నీవే సర్వమవు.

౪౧-౪౨. ఈ నీ మహిమ నెఱుగక — నిన్ను మిత్రమాత్రునిగనే భావించి — కృష్ణా, యాదవా, సఖా, అని ప్రమాదమువలననో, ప్రేమవలననో, పిలిచి భాషించుటలో చూపిన అగౌరవమునకును; విహారవేళలందును, పరుండినప్పుడును, కూర్చుండినప్పుడును, భోజనవేళలందును, నీతో — ఒంటరిగానున్నప్పుడుగాని, ఇతరులఎదుటగాని — నేను పరిహాసార్థము

యచ్చావహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు ।
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ ౪౨

పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ ॥ ౪౩

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥ ౪౪

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే ।

---

అమర్యాదచూపినందుకును; అచ్యుతా, అపరిమేయమూర్తీ, నన్ను క్షమింప వేడుకొనుచున్నాను.

౪౩. చరాచరలోకమునకు నీవు తండ్రివి, పూజ్యుడవు, మహితులకన్న మహితుడవు; ముల్లోకములలో నీకు సరివచ్చువారు లేరు; అసమానప్రభావా, ఇక నిన్ను మించినవారు ఎట్లుందురు ?

౪౪. కావున పూజ్యప్రభూ, సాష్టాంగప్రణామ మొనర్చి, క్షమాపణకై వేడుచున్నాను. తండ్రి పుత్రుని, మిత్రుడు ప్రియమిత్రుని, ప్రియుడు ప్రేయసిని, క్షమించునట్లు, ఓ దేవా, నీవు నన్ను క్షమింపవలెను.

తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస ॥ ౪౫

కిరీటినం గదినం చక్రహస్త-
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే ॥ ౪౬

శ్రీభగవానువాచ :—

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనన్తమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ ౪౭

న వేదయజ్ఞాధ్యయనైర్న దానై-
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవంరూపః శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ ౪౮

---

౪౫. మున్నెన్నడు చూడనిదానిని చూచి, అపరిమితానంద మందితిని; కాని నా మనస్సు భయవ్యాకులితమైయున్నది. దేవా, నీ ఆ (సామాన్య) రూపమునే చూపుము. దేవదేవా, జగదాశ్రయా, అనుగ్రహింపుము.

౪౬. తొల్లిటివలెనే గదాచక్రకిరీటములుదాల్చిన నిన్ను చూడ గోరెదను. సహస్రబాహూ, విశ్వరూపా, నీ చతుర్భుజాకృతినే ధరింపుము.

శ్రీ భగవానుడు పలికెను :—

౪౭. అర్జునా, నిన్ననుగ్రహించి, నా స్వీయయోగశక్తిచేత, పరమమును, తేజోమయమును, ఆద్యమును, అనంతమును, అగు నాయీవిశ్వరూపమును—మున్నెన్నడును, పరులెవరును, చూడనిదానిని—నీకు చూపితిని.

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ ౪౯

సఞ్జయ ఉవాచ:—

ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునః సౌమ్యవపుర్మహాత్మా ॥ ౫౦

అర్జున ఉవాచ:—

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥ ౫౧

---

౪౮. అర్జునా, వేదములు, యజ్ఞములు అభ్యసించుటవలనగాని, దానములవలనగాని, అగ్న్యాది క్రియలవలనగాని, ఉగ్రతపస్సులవలనగాని, ఈ నరలోకమున ఇట్టి రూపమున త్వదితరులకు నేను కానిపింపలేదు.

౪౯. భయంకరమగు నా యీ (విశ్వ) రూపమునుచూచి భీతిలవలదు, మనోవైకల్యము నొందవలదు. విగతభయుడవై, ప్రీతచిత్తుడవై, ఇప్పుడు నా యీ (పూర్వ) రూపమును చూడుము.

సంజయుడు పలికెను:—

౫౦. అర్జునునితో ఇట్లు చెప్పి వాసుదేవుడు మరల తన (పూర్వ) రూపమును చూపెను; వెఱపుగొనియున్న అతనిని ఆ మహాత్ముడు తన సౌమ్యరూపమునుదాల్చి ఓదార్చెను.

అర్జునుడు పలికెను :—

౫౧. జనార్దనా, సౌమ్యమగు నీ యీ మానుషరూపమును చూచి, నే నిప్పుడు స్వస్థచిత్తుడ నైతిని, నా నైజస్థితికి వచ్చితిని.

శ్రీభగవానువాచ:—

సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః ॥ ౫౨

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ ౫౩

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుఞ్చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప ॥ ౫౪

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సఙ్గవర్జితః ।
నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాణ్డవ ॥ ౫౫

ఇతి విశ్వరూపదర్శనం నామ
ఏకాదశోఽధ్యాయః

---

శ్రీ భగవానుడు పలికెను :—

౫౨. నీ విప్పుడు చూచిన నా ఈ రూపమును చూచుట అత్యంతదుర్లభము. ఈరూపమునుచూడ దేవతలుకూడ ఎప్పుడును వాంఛించుచుందురు.

౫౩. వేదపఠనమువలనగాని, తపస్సులవలనగాని, దానములవలనగాని, యజ్ఞములవలనగాని — నీవుచూచినట్లు — నన్ను చూచుట అసాధ్యము.

౫౪. కాని, ఏకనిష్ఠమగు భక్తిచేతమాత్రము, నన్నీరూపమున తెలిసికొనుటకును, యథార్థముగ చూచుటకును, నాలో ప్రవేశించుటకును, శక్యమగును.

౫౫. నాకొఱకే కర్మము లాచరించుచు, నన్నే పరమగమ్యముగా ఉంచుకొని, నాకు భక్తుడై, సంగవర్జితుడై, ఎవరియెడలను వైరములేక యుండువాడు, నన్ను పొందును.

***"విశ్వరూపదర్శనము" అను పేరుగల
పదునొకండవ అధ్యాయము సమాప్తము.



# ద్వాదశాధ్యాయము



## భక్తియోగము

అర్జున ఉవాచ:—

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥ ౧

శ్రీభగవానువాచ:—

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః॥ ౨

యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగమచిన్త్యం చ కూటస్థమచలం ధ్రువమ్॥ 3

---

అర్జునుడు పలికెను :—

౧. నిరంతరనిష్ఠతో ని న్ని ట్లుపాసించువారు; అవినాశిని, ఇంద్రియా గోచరుని, "ఉపాసించువారు; వీరిలో ఎవరు యోగము చక్కగానెఱిగినవారు ?

శ్రీ భగవానుడు పలికెను :—

౨. నాయందే మనస్సునిల్పి, సర్వదా "ఏకనిష్ఠులై", పరమ శ్రద్ధతో న న్నెవరుభజింతురో, వారు యోగజ్ఞులలో శ్రేష్ఠులని నా అభి ప్రాయము.

3-౪. కాని ఇంద్రియములనెల్ల నిగ్రహించి, సర్వత్ర సమబుద్ధిగలిగి,

సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః ॥ ౪

క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥ ౫

యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥ ౬

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥ ౭

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ ౮

---

సర్వభూతహితముకై పాటుపడుచు, అవినాశిని, అనిర్వచనీయుని, అవ్యక్తుని, అచింత్యుని, (మాయాధిష్ఠానుడై సాక్షిగా నిలిచియుండు) నిశ్చలుని, సుస్థిరుని, నిత్యుని ఉపాసించువారుకూడ నన్నే చేరుదురు.

౫. అవ్యక్తునందాసక్తులగువారి కష్టము అధికతరము. ఏలన శరీరధారులకు అవ్యక్త (నిర్గుణ)గమ్యమును చేరుట మిక్కిలికష్టము.

౬-౭. కాని సర్వకర్మములు నా కర్పించి, నన్నే పరమార్థముగానెంచి, ఏకనిష్ఠమగు యోగముతో నన్ను భజించువారిని — నాయందు ఆసక్తమైన చిత్తముగల వారిని — నేను అచిరకాలముననే జననమరణరూపసంసార సముద్రమునుండి ఉద్ధరింతును.

౮. నీ మనస్సును నాయందే నిలుపుము, నీ బుద్ధిని నాయందే ఉంపుము : అట్లొనర్చితివేని (దేహమునువీడిన) పిదప నిస్సంశయముగా నీవు నాయందే నివసింతువు.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ ॥ ౯

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి ॥ ౧౦

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ ౧౧

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్ ॥ ౧౨

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహఙ్కారః సమదుఃఖసుఖః క్షమీ ॥ ౧౩

---

౯. చిత్తమును నాయందే సుస్థిరముగా నిలుపజాలవేని, అభ్యాస యోగముచే నన్ను చేర ప్రయత్నింపుము.

౧౦. అభ్యాసమునకుకూడ నీవు అసమర్థుడవేని, నాకొఱకు కర్మము లాచరించుటందు ఆసక్తిగొనుము. అట్లు (నాకొఱకు కర్మము లాచరించుటవలన) కూడ నీవుసిద్ధినొందగలవు.

౧౧. దీనినికూడ చేయజాలవేని, నిగ్రహాత్ముడవై నా శరణుచొచ్చి సర్వకర్మఫలత్యాగ మొనర్పుము.

౧౨. (అజ్ఞతతోకూడిన) అభ్యాసముకంటె జ్ఞానము శ్రేష్ఠము; (కేవల) జ్ఞానముకంటె (జ్ఞానయుక్త) ధ్యానము శ్రేష్ఠము; ధ్యానముకంటె కర్మఫల త్యాగము శ్రేష్ఠము. త్యాగానంతరము శాంతి లభించును.

౧౩-౧౪. ఏ ప్రాణిని ద్వేషింపనివాడు, సర్వప్రాణులందు మైత్రిని, దయను, కలవాడు, మమతాహంకారశూన్యుడు, సుఖదుఃఖసముడు, సహన

సన్తుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తః స మే ప్రియః ॥ ౧౪

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః స చ మే ప్రియః॥ ౧౫

అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః ॥ ౧౬

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి ।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యః స మే ప్రియః ॥ ౧౭

సమః శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సఙ్గవివర్జితః ॥ ౧౮

---

శీలుడు, నిత్యసంతుష్టుడు, సుస్థిరధ్యానశీలుడు, నిగ్రహాత్ముడు, దృఢసంకల్పుడు, మనోబుద్ధులను నా కర్పించినవాడు—ఇట్టిభక్తుడు నాకు ప్రియుడు.

౧౫. లోకమును క్షోభిల్లజేయక, లోకముచే తాను క్షోభిల్లక, యుండువాడు; హర్షము, అసూయ, భయము, దిగులు, చెందకుండువాడు — నాకు ప్రియుడు.

౧౬. ఇతరాధారము నపేక్షింపనివాడు, పవిత్రుడు, సద్యఃస్ఫూర్తి గలవాడు, ఏజోలియు పెట్టుకొననివాడు, చిత్తవైకల్యరహితుడు, సకామకర్మత్యాగి — ఇట్టిభక్తుడు నాకు ప్రియుడు.

౧౭. హర్షింపక, ద్వేషింపక, శోకింపక, వాంఛింపక, యుండువాడు; శుభాశుభములను త్యజించువాడు — ఇట్టి భక్తిప్రపూర్ణచిత్తుడు నాకు ప్రియుడు.

౧౮-౧౯. శత్రుమిత్రులయెడల, సమ్మానతిరస్కారములందు ఒకే తీరున నుండువాడు; శీతోష్ణసుఖదుఃఖములయెడ సమభావముగలవాడు; ముక్తసంగుడు; నిందాస్తుతులను సమముగా ఎంచువాడు; మౌనశీలుడు;

తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సన్తుష్టో యేనకేనచిత్ ।
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః ॥ ౧౯

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ ౨౦

ఇతి భక్తియోగో నామ
ద్వాదశోఽధ్యాయః

---

లభించిన కొద్దితో సంతుష్టినందువాడు; నివాసములేనివాడు; సుస్థిరచిత్తుడు; భ[illegible]ర్ణుడు — ఇట్టివాడు నాకు ప్రియుడు.

౨౦. పైని వర్ణింపబడిన ఈ ధర్మ్యామృతమును (మృతిలేనిధర్మమును) శ్రద్ధాయుక్తులై అనుష్ఠించుచు, నన్నే పరమార్థముగా ఎంచుకొను భక్తులు నాకు అత్యంత ప్రియులు.

*** "భక్తియోగము" అను పేరుగల
పంౘెండవ అధ్యాయము సమాప్తము.



# త్రయోదశాధ్యాయము



## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

అర్జున ఉవాచ:—

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ ।
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ॥ *

శ్రీభగవానువాచ:—

ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ ౧

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ॥ ౨

---

(అర్జునుడు పలికెను :—

కేశవా, "ప్రకృతిపురుషులు", "క్షేత్రక్షేత్రజ్ఞులు", "జ్ఞానజ్ఞేయములు" —అనువాని నెఱుగగోరెదను).

శ్రీభగవానుడు పలికెను :—

౧. అర్జునా, ఈ శరీరము "క్షేత్రము" అనియు, దీనిని ఎఱుగువాడు "క్షేత్రజ్ఞుడు" అనియు, క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానముగలవారు పల్కుదురు.

౨. అన్ని "క్షేత్రము" లందు వెలయు నేనే "క్షేత్రజ్ఞుఁడ" ననియు తెలియుము. క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానమే యథార్థజ్ఞానమని నేను తలతును.

---

* ఈశ్లోకమును ప్రక్షిప్తముగా నెంచి శంకరాదులువీడిరి. కావున దీనిని లెక్కింపలేదు.

తత్క్షేత్రం యచ్చ యాదృక్ చ యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ 3

ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ ౪

మహాభూతాన్యహఙ్కారో బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః ॥ ౫

ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సఙ్ఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥ ౬

అమానిత్వమదమ్భిత్వమహింసా క్షాన్తిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥ ౭

---

3. "క్షేత్రము" ఎద్దియో, అది ఎట్టిదో, అది ఎట్టి మార్పాటులతో కూడినదో, ఏ కారణములవలన ఏ కార్యములు కలుగునో; "క్షేత్రజ్ఞు" డెవడో, వాని ప్రభావము లెవ్వియో, నాయొద్ద సంగ్రహముగా వినుము.

౪. (ఈ సత్యము) ఋషులచే పెక్కురీతులుగా, వివిధములగు స్తోత్రములందు కీర్తింపబడినది; సహేతుకములును, సంశయరహితములును, అగు బ్రహ్మసూచకవాక్యములందును వర్ణింపబడినది.

౫-౬. (పంచ)మహాభూతములు, అహంకారము, బుద్ధి, మూలప్రకృతి (అవ్యక్తము), దశేంద్రియములు, మనస్సు, ఇంద్రియవిషయములు; ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియసమష్టి, తెలివి, ధైర్యము — అని "క్షేత్రము" దాని మార్పులతోగూడ ఇట్లు సంగ్రహముగా వర్ణింపబడినది.

౭. అభిమానరాహిత్యము, దంభోక్తులాడకుండుట, అహింస, సహ

ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహఙ్కార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥ ౮

అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥ ౯

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది ॥ ౧౦

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతజ్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా ॥ ౧౧

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ ౧౨

---

నము, సరళత, ఆచార్యసేవ, (మనశ్శరీర)పారిశుద్ధ్యము, స్థిరత్వము, ఆత్మ నిగ్రహము;

౮. (శబ్దాది) ఇంద్రియవిషయములయెడ వైరాగ్యము; అహంకార శూన్యత; పుట్టుక, చావు, ముదిమి, వ్యాధి: వీనిలోని దుఃఖమును, దోషమును గూర్చి విచారించుట;

౯. నిస్సంగము; భార్యాపుత్రులు, గృహము, ఇత్యాదులు ఆత్మయని భావింపకుండుట; శుభాశుభములందు ఎల్లెడ సమచిత్తత కలిగియుండుట;

౧౦. సదా నన్నే ధ్యానించుచుండుటచే నాయందు నిశ్చలభక్తికలిగి యుండుట; ఏకాంతస్థలనివాసము; (అజ్ఞ) మానవసంసర్గమునెడవైముఖ్యము;

౧౧. ఆత్మజ్ఞాననిష్ఠ, సత్యజ్ఞానపరమార్థమును గ్రహించుట; ఇదం తయు (౮-వ శ్లోకము మొదలుగా చెప్పినది) "జ్ఞానము" అనబడును; తద్విరుద్ధము అజ్ఞానము.

౧౨. "జ్ఞేయము" (తెలిసికొనవలసినది) ఏదో, దేని నెఱుగుటచే

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ ౧౩
సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ ౧౪
బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥ ౧౫
అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ ౧౬
జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్ ॥ ౧౭

---

ముక్తి లభించునో, ఆ అనాదియగు పరబ్రహ్మమును వర్ణించెదను. అది సత్తు (భావము), అసత్తు (అభావము) కానిదందురు.

౧౩. లోకమునందంతటను కాలుసేతులు, అంతటను కన్నులు, తలలు, నోళ్లు, అంతటను చెవులు — కలిగి, అది అంతటిని అవరించి యుండును.

౧౪. ఇంద్రియగుణము లన్నిటివలన దీపించుచుండియు, అది ఇంద్రియములులేనిది; సంగరహితమయ్యు, అన్నిటికి అధారము; గుణరహితమయ్యు, గుణములను భోగించునది.

౧౫. అది (సర్వ)భూతములకు లోపలను, వెలుపలను, కలదు. అది స్థావరము, కాని జంగమముకూడ; సూక్ష్మమగుటచే తెలియరానిది; దూరమును, దగ్గఱయును కూడ.

౧౬. విభజింపశక్యముకానిది, కాని విభజింపబడినట్టు (సర్వ) భూతములం దుండును. భూతములను పోషించునదిగ, (ప్రళయవేళ) మ్రింగివేయునదిగ, (సృష్టివేళ) పుట్టించునదిగ కూడ దాని నెఱుగవలెను.

౧౭. జ్యోతు లన్నిటిని ప్రకాశింపజేయునదియగు అవస్తువు చీకటికి

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥ ౧౮

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసమ్భవాన్॥ ౧౯

కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషఃసుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥ ౨౦

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్గుణాన్।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు॥ ౨౧

ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః॥ ౨౨

---

అతీతమైనదని చెప్పుదురు; జ్ఞానముగా, జ్ఞేయముగా, జ్ఞానమునకు పరమ గమ్యముగా, ఇది అందఱిహృదయములందు సుస్థిరముగా నిలిచియుడును.

౧౮. క్షేత్రము, జ్ఞానజ్ఞేయములు సంగ్రహముగా నిట్లు వర్ణింప బడినవి. నా భక్తుడు ఇది తెలిసి నా స్వరూప మొందుట కర్హుడగును.

౧౯. ప్రకృతిపురుషులు ఇర్వురును అదిరహితులని ఎఱుగుము. వికారములు (మార్పులు), గుణములు, ప్రకృతిసంభవములనియు ఎఱుగుము.

౨౦. దేహమును, ఇంద్రియములను ఉత్పత్తిచేయు విషయమున ప్రకృతి కారణమనియు, సుఖదుఃఖానుభూతివిషయమున పురుషుడు (జీవుడు) కారణమనియు చెప్పుదురు.

౨౧. ప్రకృతియందు పురుషుడు (ఐక్యభావముతో) నిలిచి, ప్రకృతి జనితగుణములను భోగించును; అతడు యోగ్యగర్భములందు, అయోగ్య గర్భములందు, జన్మించుటకు కారణము అతనికి గుణములతోగల సంగమే.

౨౨. ఈ శరీరమున నుండు పరమపురుషుడు సాక్షి యనియు,

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥ ౨౩

ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా।
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ ౨౪

అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ ౨౫

యావత్సఞ్జాయతే కిఞ్చిత్సత్త్వం స్థావరజఙ్గమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ॥ ౨౬

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥ ౨౭

---

అనుమతించువాడనియు, పోషకుడనియు, భోగించువాడనియు, మహేశ్వరుడనియు, పరమాత్ముడనియు కూడ చెప్పబడును.

౨౩. పురుషుని, వికారసహితమగు ప్రకృతిని, ఎవ డిట్లు గ్రహించునో, అతడు ఎట్లు జీవించినను మరల జన్మింపడు.

౨౪. నిర్మలతనొందిన హృదయముద్వారా కొందఱు ధ్యానమువలన తమ బుద్ధియందు ఆత్మను దర్శింతురు; కొందఱు జ్ఞానయోగముద్వారా, మఱికొందఱు కర్మయోగముద్వారా, దర్శింతురు.

౨౫. ఇంకకొందఱు ఇట్లు ఎఱుగక, (గురువునొద్ద) విన్నవిధమున ఉపాసింతురు. తాము విన్నదే పరమశరణ్యముగా నెంచుకొని వారును మృత్యువును అతిక్రమింతురు.

౨౬. చరాచరభూతములలో ఏది పుట్టినను, (పరస్పరాధ్యాసరూపమగు) క్షేత్రక్షేత్రజ్ఞులకూడిక వలననే అని ఎఱుగుము.

౨౭. సర్వభూతములందు సమముగా — నాశమొందువానియందవినాశియై — నిలిచియుండు పరమేశ్వరుని చూచువాడే యథార్థదర్శి.

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ ౨౮

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాత్మానమకర్తారం స పశ్యతి ॥ ౨౯

యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా ॥ ౩౦

అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయమవ్యయః ।
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే ॥ ౩౧

యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే ॥ ౩౨

---

౨౮. ఈశ్వరుడు సర్వత్ర సమముగా నిల్చియుండుటను చూచువాడు ఆత్మచేత ఆత్మను హింసింపక పరమగమ్యమును చేరును.

౨౯. సర్వకర్మముల నొనర్చునది ప్రకృతియే యనియు, ఆత్మ నిష్క్రియమనియు, ఎఱుగువాడు యథార్థదర్శి.

౩౦. భూతసమూహముల నానాత్వము కేవలునియందు ఒకటిగా నిలిచియుంటను; అచటినుండియే వాని విస్తృతి కలుగుచుంటను; చూచువాడు బ్రహ్మముతో ఐక్యమందును.

౩౧. అనాది యగుటచేతను, నిర్గుణ మగుటచేతను, ఈ అక్షయ పరమాత్మ — శరీరమున నుండియు — నిష్క్రియము; కర్మములచే అంటువడదు.

౩౨. సర్వగతమగు ఆకాశము, సూక్ష్మత్వకారణముచేత, ఎట్లు అంటువడకుండునో, అట్లే సర్వత్ర దేహమున నిలిచియుండు ఆత్మ అంటువడదు.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥ 33

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్॥ 3౪

ఇతి క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ
త్రయోదశోఽధ్యాయః

---

33. ఒకే సూర్యుడు ఈ లోకము నంతయు ఎట్లు ప్రకాశింపజేయునో, అట్లే "క్షేత్రము"న నుండు ఆత్మ "క్షేత్రము" నెల్ల ప్రకాశింపజేయును.

3౪. క్షేత్రక్షేత్రజ్ఞులభేదమును, ప్రకృతి (అవిద్యాజనిత మూఢత) నుండి భూతములు విముక్తి నందుటను, జ్ఞాననేత్రముతో చూచువారు పరాత్పరుని చేరుదురు.

***"క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము" అను పేరుగల
పదుమూడవ అధ్యాయము సమాప్తము.



# చతుర్దశాధ్యాయము



## గుణత్రయ విభాగయోగము

శ్రీభగవానువాచ:—

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్।
యజ్జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధిమితో గతాః॥ ౧

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ॥ ౨

మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సమ్భవః సర్వభూతానాం తతో భవతి భారత॥ 3

సర్వయోనిషు కౌన్తేయ మూర్తయః సమ్భవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా॥ ౪

---

శ్రీభగవానుడు పలికెను:—

౧. జ్ఞానము లన్నిటిలో ఉత్తమమగు పరమజ్ఞానమును — దేనినెఱిగి మును లందఱు శరీరబంధవిమోచనానంతరము పరమసిద్ధి నందిరో దానిని — నీకు మరల చెప్పెదను.

౨. ఈ జ్ఞానము ననుష్ఠించి నా స్వరూపము నొందినవారు సృష్టికాలమున మరల పుట్టరు, ప్రళయకాలమున అపదనొందరు.

3. మహనీయమగు ప్రకృతి నా గర్భస్థానము; దానియందు నేను నా బీజము నుంతును; దానినుండి సర్వభూతములు ఉద్భవిల్లుచున్నవి.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥ ౫

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశకమనామయమ్ ।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ ॥ ౬

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్ ॥ ౭

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతి భారత ॥ ౮

సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత ।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత ॥ ౯

---

౪. సర్వగర్భములనుండి ఉద్భవించు శరీరముల కన్నిటికి మహత్తర మగు పకృతియే గర్భము; బీజము నొసగెడు తండ్రిని నేను.

౫. ప్రకృతిజనితములగు సత్త్వరజస్తమస్సులు అను గుణత్రయము అక్షయుడగు దేహిని ఈ దేహమందు గాఢముగా బంధించియుంచును.

౬. వీనిలో సత్త్వము ప్రకాశవంతము, నిర్దోషము అగు నిర్మలత్వము చేత సుఖజ్ఞానములం దాసక్తి కల్పించి, బంధించును.

౭. రజస్సు అనురాగస్వభావముగలదై, వాంఛను, ఆసక్తిని, కలిగించు నని ఎఱుగుము. అది కర్మములం దాసక్తి కల్పించి దేహిని బంధించును.

౮. తమస్సు అజ్ఞానజనితమనియు, దేహధారులకెల్ల అవివేకము కల్గించుననియు, ఎఱుగుము. అది ప్రమాదము, సోమరితనము, నిద్ర: వీనిచే బంధించును.

౯. సత్త్వము సుఖమునుకూర్చును; రజస్సు కర్మములందుచేర్చును; తమస్సు వివేక జ్ఞానము నావరించి పొరపాటును కలిగించును.

రజ స్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
రజః సత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజ స్తథా॥ ౧౦

సర్వద్వారేషు దేహేఽస్మిన్ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత॥ ౧౧

లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ॥ ౧౨

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన॥ ౧౩

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్।
తదోత్తమవిదాం లోకానమలాన్ప్రతిపద్యతే॥ ౧౪

రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే।
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే॥ ౧౫

---

౧౦. రజస్తమముల నతిక్రమించినప్పుడు సత్త్వము చూపట్టును; సత్త్వతమముల నతిక్రమించినప్పుడు రజస్సు, సత్త్వరజస్సుల నతిక్రమించి నప్పుడు తమస్సు, చూపట్టును.

౧౧. ఈ శరీరమందు సర్వేంద్రియములద్వారా జ్ఞానతేజస్సు ప్రకాశించునప్పుడు సత్త్వము ప్రాబల్యమొందిన దని ఎఱుగవలెను.

౧౨. పేరాస, చుఱుకుదనము, కార్యారంభము, అశాంతి, కాంక్ష— ఇవి రజోగుణము ప్రాబల్యమొందినప్పుడు కానిపించును.

౧౩. బుద్ధికి మనకలుక్రమ్ముట, జడత్వము, ప్రమాదము, మూఢత— ఇవి తమోగుణము ప్రబలమైనప్పుడు చూపట్టును.

౧౪. సత్త్వప్రాబల్యవేళ మరణించు దేహధారి (హిరణ్యగర్భాది) అత్యున్నతదేవతల నుపాసించువారు పోవు నిష్కలంకలోకముల కేగును.

కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్ ॥ ౧౬

సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ॥ ౧౭

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥ ౧౮

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ ౧౯

గుణానేతానతీత్య త్రీన్దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥ ౨౦

---

౧౫. రజఃప్రాబల్యకాలమున మరణించువాడు కర్మాసక్తులగువారి యందును, తమఃప్రాబల్యకాలమున మరణించువాడు మూఢజనగర్భము లందును, జన్మించును.

౧౬. సత్కర్మముల ఫలము సాత్త్వికము, నిర్మలము, అందురు; రాజసికకర్మముల ఫలము దుఃఖము; తామసికకర్మముల ఫలము అజ్ఞానము.

౧౭. సత్త్వమునుండి జ్ఞానము; రజస్సునుండి పేరాస; తమస్సునుండి పొరపాటు, మూఢత్వము, అజ్ఞానము జనించును.

౧౮. సాత్త్వికులు ఊర్ధ్వలోకముల కేగుదురు; రాజసికులు మధ్యమ (మనుష్య) లోకమున నుందురు. అధమగుణులగు తామసికులు అధోలోకముల కేగుదురు.

౧౯. ద్రష్ట (చూచువాడగు జీవుడు) గుణములు కాక వేఱుగుకర్తను చూడక, త్రిగుణముల కతీతుడగువానిని (వానిసాక్షిని) ఎప్పు డెఱుగునో, అప్పు డతడు నా స్వరూపము నొందును.

౨౦. శరీరోద్భవకారణములగు ఈ త్రిగుణముల నతిక్రమించినప్పుడు

అర్జున ఉవాచ :—

కైర్లిఙ్గైస్త్రీన్గుణానేతానతీతో భవతి ప్రభో।
కిమాచారః కథం చైతాంస్త్రీన్గుణానతివర్తతే॥ ౨౧

శ్రీ భగవానువాచ :—

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి॥ ౨౨
ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే॥ ౨౩
సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాఞ్చనః।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిన్దాత్మసంస్తుతిః॥ ౨౪

---

దేహి పుట్టుక, చావు, ముదిమి, దుఃఖము: వీనినుండి విముక్తుడై అమృతత్వమందును.

అర్జునుడు పలికెను:—

౨౧. ప్రభో, ఈ త్రిగుణముల నతిక్రమించినవానిని ఏ లక్షణములచే గుర్తింపనగును? అతని నడవడి యెట్టిది? అతడు త్రిగుణముల నెట్లు అతిక్రమించును?

శ్రీభగవానుడు పలికెను:—

౨౨. (సత్త్వజనిత) ప్రకాశము, (రజోజనిత) కార్యోత్సాహము, (తమోజనిత) మూఢత: ఇవి ఆవిర్భవించినప్పుడు ద్వేషింపక, తొలిగిపోయినప్పుడు వానిని కోరకుండువాడు;

౨౩. సంబంధింపనివానివలె కూర్చుండి, గుణములచే చలింపక, గుణములు వర్తించుచున్నవని ఎఱిగి, ఆత్మనిష్ఠుడై, తమకకుండువాడు;

౨౪. సుఖదుఃఖములందు సమబుద్ధియై, ఆత్మస్థుడై, మట్టిపెళ్లను, రాతిని, బంగారును ఒకటిగనే ఎంచుచు, ఇష్టానిష్టములకు సముడై, నిందాస్తుతులకు సమచిత్తుడగు ధీరుడు;

మానాపమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥ ౨౫

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ ౨౬

బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమమృతస్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ ॥ ౨౭

ఇతి గుణత్రయ విభాగయోగో నామ
చతుర్దశోఽధ్యాయః

---

౨౫. సన్మానతిరస్కారములందు సముడు, మిత్రులందును అమిత్రులందును సమబుద్ధి, ఉద్యమముల నన్నిటిని త్యజించినవాడు: అట్టివాడు గుణాతీతుడని చెప్పబడును.

౨౬. నన్ను నిశ్చలభక్తితో సేవించువాడుకూడ గుణాతీతుడై బ్రహ్మభూతుడగుటకు అర్హతనందును.

౨౭. ఏలన, సనాతనధర్మమును, అఖండసుఖమును అగు అక్షయ నిర్వికారబ్రహ్మమునకు నేను నిలయమను.

***"గుణత్రయ విభాగయోగము"అను పేరుగల
పదునాల్గవ అధ్యాయము సమాప్తము.



# పంచదశాధ్యాయము



## పురుషోత్తమయోగము

శ్రీభగవానువాచ:—

ఊర్ధ్వమూలమధఃశాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ ౧

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖాః
గుణప్రవృద్ధా విషయప్రవాళాః ।
అధశ్చ మూలాన్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥ ౨

---

శ్రీ భగవానుడు పలికెను:—

౧. వేళ్లు పైని (బ్రహ్మమునందు), కొమ్మలు క్రింద (లోకములో), వేదములే (కర్మకాండము) ఆకులు (ఆకులు నీడనిచ్చి చెట్టును పోషించును) : ఇట్టి శాశ్వతమగు అశ్వత్థ (రావి) వృక్షమునుగూర్చి చెప్పుదురు. దానినెఱిగినవాడు వేదముల నెఱిగినవాడే.

౨. త్రిగుణములచే పోషింపబడి దాని కొమ్మలు క్రిందను (మనుష్యుడు మొదలు) మీదను (బ్రహ్మవఱకు) వ్యాపించియుండును; ఇంద్రియ విషయములు దాని చిగుళ్లు; దాని వేళ్లు మనుష్యలోకమున ధర్మాధర్మ మూలములగు కర్మముల నుత్పత్తిచేయుచు, వ్యాపించును.

9

న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్న చ సమ్ప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూల-
మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥ ౩

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తన్తి భూయః ।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ ౪

నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై-
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్ ॥ ౫

---

౩-౪. దాని యథార్థ(అసత్)స్వరూప మిచట గోచరింపదు; దానిఅంతము, అది, ఉనికియు గోచరింపవు. స్థిరముగా పాదుకొనియుండు ఈ అశ్వత్థమును (క్షణికమయ్యు,ఎడతెగకయుండు ఈసంసారవృక్షమును) దృఢమగు అనాసక్తి యనుశస్త్రముతో ఖండించివైచినపిదప — ఎచటికేగినచో జ్ఞాను లీ సంసారమునకు మరలరారో — ఆ బ్రహ్మపదమును అన్వేషింపవలెను. అనాదియగు ఈ సంసారప్రవాహము ఎవనినుండి వెలువడినదో ఆ ఆదిమపురుషు నాశ్రయించెదను.

౫. గర్వ, విమూఢతా రహితులై, అనురాగదోషమును జయించి, ఆత్మనిష్ఠులై, నిష్కాములై, సుఖదుఃఖనామకద్వంద్వాతీతులై, జ్ఞాను లా అక్షయపదమును చేరుదురు.

న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః ।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ ౬

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।
మనఃషష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ ౭

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥ ౮

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥ ౯

ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥ ౧౦

---

౬. దానిని సూర్యచంద్రాగ్నులు ప్రకాశింపజేయరు; ఎచటి కేగిన వారు తిరిగిరారో, ఆ నా పరమపదము అదియే.

౭. నాలో నొక నిత్యాంశమే జీవలోకమున జీవుడై పుట్టి ప్రకృతిలోనుండు పంచేంద్రియములను, ఆఱవదగు మనస్సును, ఆకర్షించుచున్నది.

౮. ఈశ్వరుడు శరీరము దాల్చునప్పుడును, దానిని వీడునప్పుడును, —వాయువు సౌరభములను వాని (పుష్పాది) స్థానములనుండి కైకొనిపోవునట్లు — వీనిని (ఆఱింటిని) కైకొనిపోవును.

౯. అతడు చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు, మానసము, నధిష్ఠించి ఇంద్రియవిషయములను భోగించును.

౧౦. అత డొకదేహమునుండి మఱొకదేహమునకు పోవునప్పుడుగాని, ఆ దేహముననే ఉండునప్పుడుగాని, భోగించునప్పుడుగాని, గుణములతో

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥ ౧౧

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥౧౪

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ ।

---

కూడియున్నప్పుడుగాని, అతనిని విమూఢులు చూడజాలరు; జ్ఞాననేత్రము గలవారుమాత్రము చూతురు.

౧౧. సిద్ధత్వముకై ప్రయత్నించుయోగు లతడు తమయందే నిలిచి యుండుటను చూతురు. అపరిశుద్ధులును అవివేకులును ప్రయత్నించినను చూడజాలరు.

౧౨. సూర్యునందు నిలిచి అఖిలజగత్తును ప్రకాశింపజేయు తేజస్సు, చంద్రాగ్నులలోని తేజస్సు,— ఆ తేజస్సు నాదని ఎఱుగుము.

౧౩. (ఐశ్వరమగు) నా ఓజశ్శక్తితో నేను భూలోకమును ప్రవేశించి సర్వభూతములను భరింతును; జలస్వరూపుడగు చంద్రుడనై ఓషధులనెల్ల పోషింతును.

౧౪. జఠరాగ్నిరూపమున ప్రాణులదేహముననిలిచి, ప్రాణాపానవాయు (అ.4, శ్లో.29) సమాయుక్తుడనై, నాల్గువిధముల అన్నమును అఱిగింతును.

వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥ ౧౫

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ ౧౬

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ ౧౭

యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ ౧౮

యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥ ౧౯

---

౧౫. సర్వహృదయములందు నేను నిలిచియుందును; (పూర్వజన్మ)స్మృతి, (అతిలోక) జ్ఞానము, ఈ రెంటి విస్మృతి, నావలననే కలుగును; వేదము లన్నిటివలన ఎఱుగవలసినవాడను నేనే; వేదాంతకర్తను నేనే; వేదజ్ఞుడనుకూడ నేనే.

౧౬. లోకమున ఇరువురు పురుషులు కలరు — క్షరుడు (వినాశి), అక్షరుడు (అవినాశి). (వినాశశీలమగు) సమస్తభూతగణము క్షరము, కూటస్థుడు (ఈశ్వరునిమాయాశక్తి) అక్షరము అనబడును.

౧౭. కాని (ఈ ఇరువురునుకాని) మఱొకపురుషుడు — పరమాత్ముడనబడువాడు — "పురుషోత్తముడు" — కలడు. అతడు అవ్యయుడు, ముల్లోకములందు వ్యాపించి, వానిని పోషించు ఈశ్వరుడు.

౧౮. నేను క్షరుని కతీతుడను; అక్షరునికన్నకూడ ఉత్తముడను. కావున నే నీ లోకమందును, వేదమునందును, "పురుషోత్తమ" నామమున ప్రసిద్ధుడను.

ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్కృతకృత్యశ్చ భారత॥ ౨౦

ఇతి పురుషోత్తమయోగో నామ
పంచదశోఽధ్యాయః

---

౧౯. అసమ్మూఢుడై, ఎవడు పురుషోత్తముడ నగు నన్నిట్లు ఎఱుగునో, అతడు సర్వము నెఱిగినవాడై, నన్ను సంపూర్ణహృదయముతో భజించును.

౨౦. అత్యంతగుప్త మగు ఈ తత్త్వమును నే నిట్లు తెలిపితిని. దీని నెఱిగినవాడు మహాన్నత (బ్రహ్మ)జ్ఞానియు, కృతార్థుడును, అగును.

***"పురుషోత్తమయోగము" అను పేరుగల
పదియేనవ అధ్యాయము సమాప్తము.



# షోడశాధ్యాయము



## దైవాసురసంపద్విభాగయోగము

శ్రీభగవానువాచ:—

అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥ ౧
అహింసా సత్యమక్రోధస్త్యాగః శాన్తిరపైశునమ్ ।
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్॥
తేజః క్షమా ధృతిః శౌచమద్రోహో నాతిమానితా ।
భవన్తి సమ్పదం దైవీమభిజాతస్య భారత ॥ 3

---

శ్రీ భగవానుడు పలికెను :—

౧. భయాతీతత; చిత్తశుద్ధి; యోగ (గురువు, శాస్త్రము, బోధించినదానిని అనుభూతమొనర్చుకొనుట) జ్ఞానములందుసుస్థిరత; దానము; (బాహ్యేంద్రియ) నిగ్రహము; యజ్ఞము; శాస్త్రపఠనము; తపస్సు; సరళత్వము;

౨. అహింస; సత్యము; కోపరాహిత్యము; త్యాగము (విడనాడుట); శాంతి; ఇతరులదోషముల నెన్నమి; భూతదయ; దురాశలేమి; మృదుల ప్రవర్తన; వినమ్రత; స్థిరత్వము;

3. ధైర్యము, సహనము, చిత్తస్థైర్యము, శుచిత్వము, ద్రోహచింత

దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పదమాసురీమ్ ॥ ౪

దైవీ సమ్పద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా ।
మా శుచః సమ్పదం దైవీమభిజాతోఽసి పాణ్డవ ॥ ౫

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు ॥ ౬

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ ౭

అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ॥
అపరస్పరసమ్భూతం కిమన్యత్కామహైతుకమ్ ॥ ౮

---

లేమి; గర్వరాహిత్యము: ఇవి దైవీసంపదకు (స్థితికి) సంబంధించిపుట్టినవాని లక్షణములు.

౪. కపటము, గర్వము, అహంకారము, కోపము, పరుసదనము, అజ్ఞత: ఇవి ఆసురసంపదకుసంబంధించిపుట్టినవాని లక్షణములు.

౫. దైవీస్థితి ముక్తికి, ఆసురస్థితి బంధనమునకు, మార్గమని చెప్పుదురు. అర్జునా, శోకింపకుము; నీవు దైవీస్థితియందే జన్మించితివి.

౬. ఈ లోకమున రెండువిధముల భూతగణము సృజింపబడినది: దైవగణము, ఆసురగణము. దైవగణము సవిస్తరముగా వర్ణింపబడినది; ఆసురగణమునుగూర్చి వినుము.

౭. ఆసురప్రకృతిగలవారు జన్మసాఫల్యసిద్ధికి ఏది కార్యమో, ఏది అకార్యమో, ఎఱుగరు; శుచిత్వము, సత్ప్రవర్తన, సత్యమువారియందుకానరాదు.

౮. "జగత్తు అసత్యము; నైతికమూలరహితము; ఈశ్వరుడు లేడు;

ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ ౯

కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥ ౧౦

చిన్తామపరిమేయాం చ ప్రళయాన్తాముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥ ౧౧

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసఞ్చయాన్ ॥ ౧౨

ఇదమద్య మయా లబ్ధమిదం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥ ౧౩

---

కామప్రేరిత స్త్రీపురుషసంయోగమువలన జగత్తు కలిగినది. అన్యకారణ మేమి?" అని వారు (చార్వాకులు) అందురు.

౯. ఈ దృష్టి నవలంబించి, వినష్టాత్ములును, ఉగ్రకర్ములును, అగు ఈ అల్పబుద్ధులు జగత్తునకువైరులై, తద్వినాశముకొఱకు పుట్టుచున్నారు.

౧౦. తీరజాలనికోరికలు పెట్టుకొని; కపటము, అహంభావము, గర్వము నిండార; విమూఢతచే దుష్టభావములు గ్రహించి అశుద్ధవ్రతులై వారు వర్తింతురు.

౧౧. మృతినొందినప్పుడుగానిఅంతమొందని (వాంఛితార్థసాధనకై) అపరిమితచింతలుకలిగి, కామోపభోగమే పరమార్థముగా నెంచి, అదియే "సర్వము" అని నిశ్చయించుకొని;

౧౨. శతసంఖ్యాకములగు ఆశాపాశములచే బంధింపబడి, కామక్రోధ పరాయణులై, వారు కామభోగార్థము అన్యాయమార్గమున ధనసంచయము లార్జించుకొనగోరుదురు.

అసౌ మయా హతః శత్రుర్హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ ॥ ౧౪

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥ ౧౫

అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥ ౧౬

ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్ ॥ ౧౭

అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥ ౧౮

---

౧౩. "నేడు నా కిది లభించినది; ఈ కోరికను ఇక తీర్చుకొందును; ఇది నాది, ఈ ధనముకూడ ఇకమీదట నాదగును;

౧౪. "ఆ శత్రువును నేను పరిమార్చితిని, ఇతరశత్రువులనుకూడ పరిమార్తును. నేను ఈశ్వరుడను, భోగిని, కార్యసిద్ధినొందినవాడను, బలవంతుడను, సుఖిని;

౧౫. "నేను ధనాఢ్యుడను, సద్వంశజాతుడను; నాతోసమానులగు ఇతరు లెవ్వరు? నేను యజ్ఞముచేయుదును, దానమొనర్తును, ఆనందింతును" అని అజ్ఞానమోహితులై;

౧౬. అనేకసంకల్పములతో చిత్తము విభ్రమమొంద, మూఢతయను వలలో చిక్కుకొని, కామభోగములందు ప్రసక్తులై, వారు అశుచియగు నరకమున కూలుదురు.

౧౭. ఆత్మస్తుతిశీలురై, వినయశూన్యులై, ధనగర్వప్రమత్తతాపూరితులై, వారు విధ్యుక్తవిధానము నుల్లంఘించి, కపటముగా పేరుకుమాత్రము యజ్ఞము లొనర్తురు.

తానహం ద్విషతః క్రూరాన్సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥ ౧౯

ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్ ॥

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ ౨౧

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః ।
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్ ॥ ౨౨

యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ ౨౩

---

౧౮. అహంకార, బల, గర్వ, కామ, క్రోధయుక్తులై ఈ ఈర్ష్యాపరులు తమదేహమందును, ఇతరదేహములందును (ఆత్మరూపమున) నిలిచియుండు నన్ను ద్వేషింతురు.

౧౯. విద్వేషులు, క్రూరులు, అశుభవర్తనులు అగు ఈ నరాధములను నేను సదా ఈలోకములోని (పెక్కునరకద్వారములగుండ బోవు సంసారములోని) అసురయోనులందే (ఉ. పులులు, సర్పములు) కూలద్రోయుచుందును.

౨౦. అసురగర్భములలో పడి, ప్రతిజన్మమునను మూఢులైయుండి, నన్ను పొందక, వారు ఇంకను అధమతర గతులలో పడుచుందురు.

౨౧. ఆత్మవినాశకరములగు నరకద్వారములు మూడువిధములైనవి కలవు: కామము, కోపము, లోభము (పేరాస). కావున ఈ మూటిని విడనాడవలెను.

౨౨. తమో (నరక) ద్వారములగు ఈ మూటిని దాటినవాడు ఆత్మశ్రేయోదాయకాచరణ మొనర్చి, మోక్షమునందును.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥ ౨౪

ఇతి దైవాసురసమ్పద్విభాగయోగో నామ
షోడశోఽధ్యాయః

---

౨౩. శాస్త్రవిధుల నుల్లంఘించి యథేచ్ఛాప్రవర్తన మవలంబించు వాడు సిద్ధత్వమొందఁడు. సుఖమునుగాని మోక్షమునుగాని పొందడు.

౨౪. కావున కర్తవ్యాకర్తవ్యనిర్ణయమున శాస్త్రములే నీకు ప్రమాణ మగుగాక. శాస్త్రోక్తవిధినిషేధముల నెఱిగి నీ వీలోకమున ప్రవర్తింపవలెను.

***"దైవాసురసంపద్విభాగయోగము" అను పేరుగల
పదునాఱవ అధ్యాయము సమాప్తము.



# సప్తదశాధ్యాయము



## శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జున ఉవాచ :—

యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః ।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః ॥ ౧

శ్రీభగవానువాచ:—

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ ౨

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః॥

యజన్తే సాత్త్వికా దేవాన్యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః ॥ ౪

---

అర్జునుడు పలికెను :—

౧. కృష్ణా, శాస్త్రవిధులను విడనాడి, శ్రద్ధతో యజ్ఞముచేయువారి నిష్ఠ యెట్టిది? అది సాత్త్వికమా, రాజసికమా, తామసికమా?

శ్రీ భగవానుడు పలికెను :—

౨. దేహులకు నైజముగానుండు శ్రద్ధ త్రివిధము — సాత్త్వికము, రాజసికము, తామసికము. దానినిగూర్చి వినుము.

3. ప్రతివానిశ్రద్ధయు వాని పూర్వసంస్కారముల కనుగుణమై యుండును. మనుష్యుడు శ్రద్ధాస్వరూపుడు; అతనిశ్రద్ధ ఎట్టిదో అత డట్టివాడే.

అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః ।
దమ్భాహఙ్కారసంయుక్తాః కామరాగబలాన్వితాః ॥ ౫

కర్శయన్తఃశరీరస్థం భూతగ్రామమచేతసః ।
మాం చైవాన్తఃశరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ ౬

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥ ౭

ఆయుఃసత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః ।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః॥ ౮

కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥ ౯

---

౪. సాత్త్వికులు దేవతలనర్చింతురు; రాజసికులు యక్షరాక్షసులనర్చింతురు; (ఇతరులు) తామసికులు ప్రేతములను, భూతగణములనుఅర్చింతురు.

౫-౬. శాస్త్రనిర్దిష్టములుకాని ఘోరతపముల నాచరించుచు, దంభప్రవర్తనము, అహంకారము, గలవారు; కామముయొక్కయు, ఆసక్తియొక్కయు బలముచేత నడుపబడుచు, బుద్ధిహీనులగుటచేత శరీరములోని అవయవము లన్నిటిని, శరీరమందు నిలిచియుండు నన్నును, పీడించువారు: అసురనిశ్చయు లని ఎఱుగుము.

౭. ఇం దొక్కొక్కవిధమువారికి ప్రీతికరమగు ఆహారముకూడ త్రివిధము; అట్లే వారికి ప్రీతికరములగు యజ్ఞములు, తపస్సులు, దానములు త్రివిధము. వాని భేదములు వినుము.

౮. ఆయుస్సు, కార్యోత్సాహశక్తి, బలము, ఆరోగ్యము, సుఖము. ఆకలి: వీనిని అభివృద్ధిచేయునవి; రసవంతములు, చమురుగలవి, పుష్టికరములు, మనోహరములు అగునవి; అగు ఆహారపదార్థములు సాత్త్వికులకు ప్రీతికరములు.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ ౧౦

అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥ ౧౧

అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ ౧౨

విధిహీనమసృష్టాన్నం మన్త్రహీనమదక్షిణమ్ ।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ ౧౩

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ ౧౪

---

౯. మిక్కిలిచేదువి, పుల్లనివి, ఉప్పనివి, ఉష్ణముచేయునవి, కారపువి, ఎండినవి, మంటకలిగించునవి; బాధను, శోకమును, రోగమును కలిగించునవి: ఇట్టి ఆహారములు రాజసికులకు ప్రీతికరములు.

౧౦. నిలువయుండిచల్లారిపోయినవి, రుచిహీనములు, పాసిపోయి కంపుకొట్టునవి, చలిదిగామాఱినవి, తినగామిగిలిపోయినవి, అశుద్ధములు: ఇట్టి ఆహారములు తామసికులకు ప్రీతికరములు.

౧౧. నిష్ఫలాపేక్షతో, శాస్త్రవిధ్యుక్తముగా, యజ్ఞమందే బుద్ధినిలిపి, యజించుటే కర్తవ్యముగా నెంచుకొని, చేయు యజ్ఞము సాత్త్వికము.

౧౨. ఫలాపేక్షతో, దంభార్థమై చేయు యజ్ఞము రాజసికము.

౧౩. శాస్త్రవిధుల ననుసరింపక; అన్నదానము చేయక; మంత్ర, దాన, శ్రద్ధా విహీనముగా; చేయు యజ్ఞము తామసిక మని చెప్పబడును.

౧౪. దేవతలను, ద్విజులను, గురువులను, జ్ఞానులను పూజించుట,

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥ ౧౫

మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే ॥ ౧౬

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే ॥ ౧౭

సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥ ౧౮

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥ ౧౯

---

శుచిత్వము, నిష్కపటవర్తనము, బ్రహ్మచర్యము, అహింస : ఇవి శారీర తపస్సు అనబడును.

౧౫. ఇతరులమనస్సును నొప్పింపనిదియు, సత్యమైనదియు, ప్రియమైనదియు, హితకరమైనదియు అగు సంభాషణము, వేదాధ్యయనము : ఇవి వాక్సంబంధతపస్సు అనబడును.

౧౬. ప్రశాంతబుద్ధి, ఉపకారశీలత, మౌనము, ఆత్మనిగ్రహము, చిత్తశుద్ధి : ఇవి మానసికతప మనబడును.

౧౭. ఈ ముత్తెఱగుతపస్సు సమాహితచిత్తులచేత, పూర్ణశ్రద్ధతో, నిష్ఫలాపేక్షతో, చేయబడినది "సాత్త్విక" మనబడును.

౧౮. సన్మానము, గౌరవము, పూజనము పొందగోరి, విశ్వాసరహితముగా, చేయుతపస్సు "రాజసిక" మనబడును. అది నిలుకడలేనిది, స్థిరముకానిది.

౧౯. మూఢభావముతో, తనకుపీడకలిగించుకొనుచునో, ఇతరులవినాశముకొఱకో, చేయు తపస్సు ఇచట "తామసిక" మనబడును.

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥ ౨౦

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ ౨౧

అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్॥ ౨౨

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥ ౨౩

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః।
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్॥ ౨౪

---

౨౦. "దానముచేయుట కర్తవ్యము" అను భావముతో, ప్రత్యుపకారముచేయజాలనివానికి, దానపాత్రునికి, ఉచితప్రదేశమున, ఉచితకాలమున చేయు దానము "సాత్త్విక" మని యెన్నబడును.

౨౧. ప్రత్యుపకారమొందుకొఱకో, ఫలాపేక్షతోనో, మనఃపూర్తిగా కాకయో, చేయబడు దానము "రాజసిక"మని యెన్నబడును.

౨౨. అపాత్రులకు, సత్కారరహితముగా, తిరస్కారబుద్ధితో, అనుచితకాలమున, అనుచితస్థలమున, చేయు దానము "తామసిక" మన బడును.

౨౩. "ఓమ్, తత్, సత్" అనునది బ్రహ్మమునకు త్రివిధనామ మని చెప్పబడినది. దానివలననే పూర్వము బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు నిర్మింపబడినవి.

౨౪. కావున వేదముల ననుసరించువారు "ఓమ్" శబ్దము నుచ్చరించియే శాస్త్రోక్తములగు యజ్ఞదానతపఃక్రియల నెల్లప్పుడు నొనర్తురు.

తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః ॥ ౨౫

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥ ౨౬

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥ ౨౭

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥ ౨౮

ఇతి శ్రద్ధాత్రయ విభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః

---

౨౫. మోక్షాసక్తులు "తత్" శబ్దము నుచ్చరించియే వివిధములగు యజ్ఞదానతపఃక్రియలను నిష్ఫలాపేక్షతో ఆచరింతురు.

౨౬. "సత్" శబ్దము "సత్తు" (వాస్తవపదార్థము) అను నర్థమునను, 'మంచిది' అను నర్థమునను, ప్రయోగింపబడును. శుభకర్మము అనునర్థమునగూడ వాడబడును.

౨౭. యజ్ఞతపోదానములందు నిష్ఠనుకూడ సచ్ఛబ్దము తెలుపును ; ఈశ్వరప్రీత్యర్థము (లేక, ఈ క్రియలకొఱకు) చేయబడుకర్మముకూడ సచ్ఛబ్దముచే తెలుపబడును.

౨౮. శ్రద్ధాహీనముగా వేల్చబడినయజ్ఞము, ఈయబడినదానము, చేయబడినక్రియ, ఒనర్పబడినతపస్సు అసచ్ఛబ్దముచే సూచింపబడును; అది ఇహపరములందు నిష్ప్రయోజనము.

***"శ్రద్ధాత్రయ విభాగయోగము" అను పేరుగల
పదునేడవ అధ్యాయము సమాప్తము.



# అష్టాదశాధ్యాయము



## మోక్షసంన్యాసయోగము

అర్జున ఉవాచ :—

సంన్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన॥ ౧

శ్రీభగవానువాచ:—

కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥ ౨

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే॥ ౩

---

అర్జునుడు పలికెను :—

౧. కృష్ణా, సన్న్యాసముయొక్కయు, త్యాగముయొక్కయు తత్త్వమును (వాస్తవికతను) నేను వేర్వేఱుగ వినగోరెదను.

శ్రీ భగవానుడు పలికెను :—

౨. ఫలకాంక్షతోచేయు కర్మములు త్యజించుటను ప్రాజ్ఞులు సన్న్యాసమందురు. సర్వకర్మఫలమును త్యజించుటను జ్ఞానులు త్యాగ మందురు.

౩. కర్మములన్నియు దోషయుక్తములు గనుక త్యజింపవలెనని కొందఱును, యజ్ఞదానతపస్సులు త్యజింపరాదని కొందఱును ప్రాజ్ఞులు చెప్పుదురు.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సమ్ప్రకీర్తితః ॥ ౪

యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ ౫

ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥ ౬

నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః ॥ ౭

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ ౮

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః॥ ౯

---

౪. త్యాగమునుగూర్చి నా సిద్ధాంతమును వినుము. త్యాగము మూడు విధములని చెప్పబడినది.

౫. యజ్ఞదానతపఃకర్మములు కర్తవ్యములు, అవి త్యజింపరాదు. ఏలన, అవి జ్ఞానులకు చిత్తశుద్ధికరములు.

౬. కాని ఈ కర్మములనుకూడ కర్తృత్వాభిమానమును, ఫలాపేక్షను త్యజించి చేయవలెనని నా నిశ్చితమును, ఉత్తమమును అగు సిద్ధాంతము.

౭. "నిత్యకర్మముల"సన్న్యాసము యుక్తముకాదు. మూఢతచే వానిని త్యజించుట తామసికమని చెప్పబడును.

౮. కష్టమైనదిగనుక దేహశ్రమముకలుగు ననువెఱపుచే, కార్యమును త్యజించువాడు రాజసికత్యాగ మొనర్చి, ఆ కర్మఫలమును కోల్పోవును.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥ ౧౦

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే॥ ౧౧

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినాం క్వచిత్॥ ౧౨

పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే।
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ ౧౩

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥ ౧౪

---

౯. సంగమును, ఫలాపేక్షను, త్యజించి, "ఇది కర్తవ్యము" అను కారణముచేతనే నిత్యకర్మ మొనర్పబడినప్పుడు ఆ త్యాగము సాత్త్వికముగా పరిగణింపబడును.

౧౦. సంశయవిచ్ఛేద మొంది, సత్త్వగుణప్రయుక్తుడై, జ్ఞాననిష్ఠుడై యుండు త్యాగి అనిష్టకర్మమును ద్వేషింపడు, ఇష్టకర్మమునందు ఆసక్తి గొనడు.

౧౧. కర్మములను నిశ్శేషముగా త్యజించుట దేహధారి కశక్యము. కావున కర్మఫలములను త్యజించువాడు "త్యాగి" అనబడును.

౧౨. అత్యాగులకు త్రివిధమగు కర్మఫలము — అనిష్టము, ఇష్టము, మిశ్రము—మరణానంతరము కలుగును. త్యాగులకు ఎన్నడును కలుగదు.

౧౩. కర్మకాండాంతమగు సాంఖ్యమున(అత్యున్నతజ్ఞానమున) పేర్కొనబడిన—సమస్తకర్మములు నెఱవేఱుటకు కారణములైన— ఈ యైదింటిని నావలన తెలిసికొనుము.

శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః ॥ ౧౫

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః ।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః ॥ ౧౬

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాపి స ఇమాఁల్లోకాన్న హన్తి న నిబధ్యతే ॥ ౧౭

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ ౧౮

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥ ౧౯

---

౧౪. దేహము, కర్త, వివిధేంద్రియములు, వివిధములగు వేర్వేఱు చేష్టలు, ఐదవది అధిష్ఠానదేవతావర్గము.

౧౫. మానవు డొనర్చు సర్వకర్మములకు — న్యాయ్యములకు, అన్యాయ్యములకు; దైహికములకు, మానసికములకు, వాగ్రూపములకు — ఈ యైదే హేతువులు.

౧౬. కావున — అపరిశుద్ధబుద్ధిచేత — అఖండమగు తన ఆత్మనే కర్తగనెంచు దుర్మతి (యథార్థముగా) చూచుటలేదు.

౧౭. "అహంభావము" లేక, (శుభాశుభములచే) తమకకుండు బుద్ధిగల వాడు వీరిని చంపినను చంపనివాడే; వాడు (ఈ కర్మముచేత) బద్ధుడును కాడు.

౧౮. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత: ఇవి కర్మమొనర్ప ప్రేరించు త్రివిధ కారణములు. ఉపకరణము, ఉద్దేశము, చేయువాడు: ఇవి త్రివిధకర్త్రాశ్రయములు.

౧౯. సాంఖ్యదర్శనమున (ఇది గుణవిషయమున పరమప్రమాణము),

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ ౨౦

పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్పృథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్॥ ౨౧

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్॥ ౨౨

నియతం సఙ్గరహితమరాగద్వేషతః కృతమ్॥
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే॥ ౨౩

యత్తు కామేప్సునా కర్మ సాహఙ్కారేణ వా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్॥ ౨౪

---

జ్ఞానము, కర్మము, కర్త అనునవి గుణభేదానుసారముగా త్రివిధము లనియే చెప్పబడినవి. వానినిగూర్చికూడ యథాతథముగ వినుము.

౨౦. వేర్వేఱుగానుండు సర్వభూతములందును ఏకమైయుండు అద్వితీయ, అక్షయ వస్తువును చూచువానిజ్ఞానము సాత్త్వికమని ఎఱుగుము.

౨౧. సమస్తభూతములందు, వివిధములై, పరస్పరభిన్నములై (ఒక్కొక్కశరీరమున నొక్కొక్కరీతిదై) యుండు, ఆత్మలను చూచువాని జ్ఞానము రాజసికము.

౨౨. ఒకే "కార్యము" (శరీరాదివస్తువు) నందు — అదియే సమస్తమైనట్లు — బుద్ధిని ఆసక్తపఱచునట్టి అయుక్తియుక్తము, అయథార్థము, తుచ్ఛము, అగు జ్ఞానము తామసిక మనబడును.

౨౩. ముక్తసంగుడు, ఫలాపేక్షారహితుడు, అగువాడు రాగద్వేషములను వీడి చేయు కర్తవ్యకర్మము సాత్త్విక మనబడును.

౨౪. కోర్కులుకలిగియో, అహంకారముతోడనో, మిక్కిలి ప్రయాసపడి చేయు కర్మము రాజసిక మనబడును.

అనుబన్ధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్ ।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే ॥ ౨౫

ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ ౨౬

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ ౨౭

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ ౨౮

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ ॥ ౨౯

---

౨౫. కర్మమువలన కలుగు (శుభాశుభ) ఫలములను, శక్తి, ద్రవ్యక్షయములను, (పర) హింసను, (స్వ) సామర్థ్యమును, విచారింపక మూఢతవలన ప్రారంభించుకార్యము తామసిక మనబడును.

౨౬. అసక్తిరహితుడు, అహంకారశూన్యుడు, ధైర్యోత్సాహయుక్తుడు, కార్యసిద్ధ్యసిద్ధులచేత పొంగక, క్రుంగక, యుండువాడు, అగుకర్త సాత్త్వికుడనబడును.

౨౭. రాగసంక్షుభితుడు, కర్మఫలాకాంక్షి, లోభి, హింసాశీలుడు, అపవిత్రుడు, సంతోషవిషాదవిధేయుడు, అగు కర్త రాజసికుడనబడును.

౨౮. అస్థిరుడు, పామరుడు, వినయవిహీనుడు, వంచకుడు; స్వార్థతచేత పరులకు హానిచేయువాడు, సోమరి, అధీరుడు, జాగుచేయువాడు, అగు కర్త తామసికుడనబడును.

౨౯. గుణములనుబట్టి బుద్ధియందును, ధృతి (పట్టుదల) యందును, ఏర్పడు త్రివిధభేదములను నిశ్శేషముగా వేర్వేఱుగా ఎఱిగింతును. వినుము.

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥ ౩౦

యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।
అయథావత్ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ ॥ ౩౧

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥ ౩౨

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేన్ద్రియక్రియాః ।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥ ౩౩

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున ।
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥ ౩౪

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముఞ్చతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥ ౩౫

---

౩౦. కర్మ, కర్మత్యాగ, మార్గములను; కర్తవ్యాకర్తవ్యముల, భయాభయముల, బంధమోక్షములకారణమును; ఎఱుగు బుద్ధి సాత్త్వికము.

౩౧. ధర్మాధర్మములను, కార్యాకార్యములను తప్పువిధమున గ్రహించుబుద్ధి రాజసికము.

౩౨. తమోగుణముచే కప్పువడి, అధర్మమును ధర్మముగను, సర్వవిషయములను వ్యత్యస్తముగను, గ్రహించుబుద్ధి తామసికము.

౩౩. మనస్సుయొక్క, ప్రాణముయొక్క, ఇంద్రియములయొక్క, క్రియలను క్రమముగా నడుపుచు, యోగముచేత సుస్థిరతచెందిన "ధృతి" సాత్త్వికము.

౩౪. ధర్మార్థకామములవైపునకు బుద్ధిని మరల్చి, అందు ప్రతిదాని ఫలమును పరిపూర్ణాసక్తితో అభిలషింపజేయు "ధృతి" రాజసికము.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥ 36

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ ॥ 37

విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38

యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః ।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥ 39

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్త్రిభిర్గుణైః ॥ 40

---

35. నిద్రను, భయమును, సంతాపమును, వ్యాకులతను, మదమును, బుద్ధిహీనుడగువాడు పరిత్యజింపకుండునట్లుచేయు "ధృతి" తామసికము.

36. త్రివిధమగుసుఖమునుగూర్చి ఇప్పుడు వినుము. అభ్యసించుకొలది దేనియందు మానవుడు ఆనందమునొందునో, దేనియందు దుఃఖాంతమునొందునో;

37. ఏది మొదట విషప్రాయముగానుండి చివర కమృతప్రాయమగునో, ఆ సుఖము సాత్త్వికము. ఆత్మానుభూతిచే కలుగు ప్రసన్నబుద్ధిత్వమువలన అది కలుగును.

38. విషయములతో ఇంద్రియములుకూడుటచే కలుగునదియు, మొదట అమృతప్రాయముగానుండి చివరకు విషప్రాయమగునదియు, అగు సుఖము రాజసికము.

39. నిద్ర, మాంద్యము, పొరపాటు : వీనిచే కలిగి, ఆత్మసమ్మోహతయందు ప్రారంభమై, అందే అంతమొందుసుఖము తామసికము.

బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరన్తప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥ ౪౧

శమో దమస్తపః శౌచం క్షాన్తిరార్జవమేవ చ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్॥ ౪౨

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్।
దానమీశ్వరభావశ్చ క్షాత్రంకర్మ స్వభావజమ్॥ ౪౩

కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ ౪౪

స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరతః సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు॥ ౪౫

---

౪౦. భూలోకమున ప్రాణులందుగాని, స్వర్గమున దేవతలందుగాని, ప్రకృతి జన్యములగు ఈ త్రిగుణములు లేనివారు లేరు.

౪౧. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రుల కర్మములు వారివారి స్వభావ జనితములగు గుణములప్రకారము విభాగింపబడినవి.

౪౨. శమదమములు (మానసేంద్రియనిగ్రహము), తపస్సు, శుచిత్వము, సహనము, నిష్కాపట్యము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తికత: ఇవి బ్రాహ్మణులకు స్వభావజనితకర్మములు.

౪౩. శౌర్యము, ధీరత, స్థైర్యము, సద్యఃస్ఫూర్తి, యుద్ధమున వెన్నుచూపమి, ఈవి, పభుత్వము: ఇవి క్షత్రియులకు స్వభావజనితకర్మములు.

౪౪. సేద్యము, పశుపోషణము, వర్తకము వైశ్యులకును; సేవాకార్యమొనర్చుట శూద్రులకును; స్వభావజనితకర్మములు.

౪౫. తనతనకర్మమును శ్రద్ధతో ఆచరించు ప్రతివాడును సిద్ధత్వమందును. స్వకర్మాభిరతుడగువాడు ఎట్లు సిద్ధత్వమొందునో వినుము.

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥ ౪౬

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ ౪౭

సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్ ।
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ ౪౮

అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసేనాధిగచ్ఛతి ॥ ౪౯

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే ।
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ ౫౦

---

౪౬. ఎవనినుండి సర్వభూతము లుత్పత్తియగునో, ఎవనిచే ఈ సర్వము పరివ్యాప్తమో, అతనిని స్వకర్మాచరణమూలముగ అర్చించి మానవుడు సిద్ధినందును.

౪౭. చక్కగా ఆచరింపబడిన ఇతరునికర్మముకంటె సదోషముగా ఆచరింపబడిన స్వకర్మము శ్రేయస్కరము. స్వభావనియతకర్మ మొనర్చువాడు పాపమొందడు.

౪౮. జన్మసిద్ధమగు కర్మమును దోషయుక్తమైనను త్యజింపరాదు. ఏలన, కర్మము లన్నియు — అగ్ని పొగచేత కప్పబడినట్లు — దోషము వలన కప్పబడియుండును.

౪౯. దేనియందును అనక్తిగొనని బుద్ధిగలిగి, ఆత్మనిగ్రహయుక్తుడై, వాంఛాశూన్యుడై, యుండువాడు సన్న్యాసమువలన కర్మాతీతదశారూప సంసిద్ధి నొందును.

౫౦. అట్టిసంసిద్ధి నంది అతడు జ్ఞానపరమార్థమగు బ్రహ్మము నెట్లు పొందునో, సంగ్రహముగా వినుము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ।
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥ ౫౧

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ ౫౨

అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్య నిర్మమః శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే॥ ౫౩

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి।
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ ౫౪

భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥ ౫౫

---

౫౧. పరిశుద్ధబుద్ధిగలిగి, దేహేంద్రియములను స్థైర్యముతో నిగ్రహించి, శబ్దాది విషయములను త్యజించి, రాగద్వేషములను విడనాడి;

౫౨. ఏకాంతప్రదేశమున కేగి, అల్పాహారము కైకొనుచు, దేహమును, మాటలను, మనస్సును అరికట్టి, సదా ధ్యానయోగపరుడై, వైరాగ్యసాధన చేయుచు;

౫౩. అహంకారమును, బలమును, గర్వమును, కామక్రోధములను, స్వామ్యమును (కలిమిని) త్యజించి, మమతాశూన్యుడై, శాంతిగలిగి యుండు వాడు బ్రహ్మత్వమున కర్హుడు.

౫౪. బ్రహ్మత్వమొంది, ప్రశాంతచిత్తుడై, అతడు శోకింపడు, వాంఛింపడు; సర్వభూతసముడై నాయందు పరమభక్తిని పొందును.

౫౫. భక్తిచే నతడు నే నెవరైనది, ఏమియైనది, యథార్థముగా ఎఱుగగలుగును. నన్ను యథార్థముగా గ్రహించినవెనువెంటనే నాయందు ప్రవేశించును.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥ ౫౬.

చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః ।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥ ౫౭

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ।
అథ చేత్త్వమహఙ్కారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥ ౫౮

యదహఙ్కారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ ౫౯

స్వభావజేన కౌన్తేయ నిబద్ధః స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్ ॥ ౬౦

---

౫౬. సదా సర్వకర్మముల నాచరించుచుండియు నాశరణుచొచ్చుట చేత అతడు నాకృపవలన నిత్య, అవికార్య(మార్పులులేని), పదమునందును.

౫౭. సర్వకర్మములను మానసికముగా నాకు సమర్పించి, నన్నే పరమార్థముగా భావించుకొని, స్థిరబుద్ధిత్వమవలంబించి, నీవు సదా నాయందే చిత్తము నిల్పుము.

౫౮. చిత్తమును నాయందు నిలిపి, నీవు నాకృపవలన అంతరాయములనెల్ల దాటుదువు; కాని అహంకారముచే నామాట వినవేని, వినాశమొందుదువు.

౫౯. అహంకారపరిపూరితుడవై "నేను యుద్ధముచేయను" అని తలతువేని నీ నిశ్చయము వ్యర్థము; నీ (క్షత్రియ) స్వభావమే నిన్ను బలాత్కరించును.

౬౦. మూఢత్వముచే నీవు చేయనిచ్ఛగింపనిదానిని, నీ స్వభావజనిత కర్మము (సంస్కారముల) వలన బద్ధుడవై, తప్పించుకోజాలక, ఇష్టములేకున్నను చేయుదువు.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥ ౬౧

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥౬౨

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥ ౬౩

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥ ౬౪

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ ౬౫

---

౬౧. ఈశ్వరుడు సర్వభూతహృదయములందు నెలకొని వానిని తన మాయవలన — యంత్రముపై నిలుపబడినవానిని బోలె — తిరుగుచుండున ర్జునా.

౬౨. పరిపూర్ణహృదయముతో అతని నాశ్రయింపుము. అతని కృపచే నీవు పరమశాంతిని, శాశ్వతస్థానమును ప్రాపింతువు.

౬౩. గోప్యమైనవానియన్నిటికన్న గోప్యతరమగు జ్ఞానమును నీకు బోధించితిని. దానిని నీవు సంపూర్ణముగా విమర్శించి, నీ యిష్టానుసారము చేయుము.

౬౪. అన్నిటికన్నను గోప్యమగు నా శ్రేష్ఠతమవాక్యమును మరల వినుము. నీవునాకు అత్యంతప్రియుడవు గనుక నీకు హితమైనదానిని తెలుపుదును.

౬౫. నీమనస్సును నాయందు నిలుపుము; నా భక్తుడవుకమ్ము; యజ్ఞములను నా కర్పింపుము; నాకు నమస్కరింపుము; నన్ను తప్పక చేరుదువు. నాకుప్రియుడవు గనుక నీ కిది ప్రమాణపూర్వకముగా చెప్పుచున్నాను.

సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥

య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయం ॥

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥ ౬౯

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టః స్యామితి మే మతిః ॥ ౭౦

శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపి ముక్తః శుభాఁల్లోకాన్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ ॥

---

౬౬. సర్వధర్మములను (అధర్మసహితముగా) విడనాడి, (ఆత్మరూపమున ఎల్లరలోనుండు) నన్నొక్కనినే ఆశ్రయింపుము. నేను నిన్ను అన్ని పాపములనుండి విముక్తుని చేయుదును. శోకింపవలదు.

౬౭. ఈ గీతాశాస్త్రమును తపోరహితులకు, భక్తిహీనులకు, శుశ్రూషింపనివారికి, నాయెడల దురాక్షేపణలుచేయువారికి, ఎన్నడు తెలుపరాదు.

౬౮. నాయందు పరమభక్తికలిగి ఈ అత్యంతగోప్యమగు శాస్త్రమును నాభక్తులకు బోధించువాడు నిస్సంశయముగా నన్నే చేరును.

౬౯. మనుష్యులలో అతనికన్న నాకు ప్రియముచేయువాడు లేడు. అతనికన్న నాకు ప్రియతరుఁడితరు డెవ్వడును ఈ లోకమున నుండబోడు.

౭౦. మా యీ ధర్మసంవాదము భక్తితోపఠించువాడు నన్ను జ్ఞానయజ్ఞరూపముగా పూజించినవా డగును. ఇది నా నిశ్చయము.

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చిదజ్ఞానసంమోహః ప్రనష్టస్తే ధనఞ్జయ ॥ ౭౨

అర్జున ఉవాచ:—

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ ॥ ౭౩

సఞ్జయ ఉవాచ :—

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాదమిమమశ్రౌషమద్భుతం రోమహర్షణమ్ ॥ ౭౪

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానిమం గుహ్యమహం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతః స్వయమ్॥

---

౭౧. శ్రద్ధావంతుడై, అసూయారహితుడై, దీనిని వినువాడుకూడ ముక్తుడై, పుణ్యకర్ములొనర్చినవా రేగు లోకముల కేగును.

౭౨. నీవు దీనిని ఏకాగ్రచిత్తముతో వింటివా? నీ అజ్ఞానజనిత మూఢత్వము నశించినదా ?

అర్జునుడు పలికెను :—

౭౩. అచ్యుతా, నీకృపచేత నా మూఢత నశించినది. నా (ఆత్మతత్త్వము యొక్క) జ్ఞప్తిలభించినది. స్థైర్య మలవడినది. సంశయములు తొలగినవి. నీమాట ననువర్తింతును.

సంజయుడు పలికెను :—

౭౪. వాసుదేవునకును మహాత్ముడగు అర్జునకును జరిగిన ఈ అద్భుత సంవాదమును, రోమములు గగుర్పొడుచుచుండ, నే నిట్లు వింటిని.

౭౫. (నాకు దివ్యచక్షువు నిచ్చిన) వ్యాసునికృపచేత, పరమగోప్యమగు ఈ యోగమును యోగేశ్వరుడగు కృష్ణుడు వివరించుచుండగా, ఆయన యొద్దనుండియే, నేను వింటిని.

రాజన్సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః ।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః ॥

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥ ౭౮

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసంన్యాసయోగో
నామాష్టాదశోఽధ్యాయః

---

౭౬. రాజా, కృష్ణార్జునులకు జరిగిన పుణ్యము, అద్భుతము, అగు ఈ సంవాదము ఎన్నిసార్లు నా జ్ఞప్తికి వచ్చునో, అన్నిసార్లు నేను (మరల మరల) హర్షించుచున్నాను.

౭౭. రాజా, శ్రీకృష్ణుని అత్యద్భుతమగు ఆ (విశ్వ) రూపము నా కెన్ని సార్లు జ్ఞప్తికివచ్చునో అన్నిసార్లు నేను మిక్కిలి అబ్బురమందుచు (మరల మరల) హర్షించుచున్నాను.

౭౮. యోగేశ్వరుడగు కృష్ణుడును, ధనువుధరించిన అర్జునుడును ఎచట నుందురో, అచట సంపద, విజయము, అభ్యుదయము, స్థిరమగు రాజనీతియు, ఉండును. ఇది నా అభిప్రాయము.

శ్రీమద్భగవద్గీతలో—బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జునసంవాదరూపమును అగుదానిలో—
"మోక్షసన్న్యాసయోగము" అను పేరుగల
పదునెనిమిదవ అధ్యాయము సమాప్తము.
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః